ఆగష్టు 1998
సంపుటి 14 సంచిక 8

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
© 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

Printed at
***SREEVANI OFFSET PRINTERS***
Machilipatnam

*Despatched on*
**7 - 8 -1998**

# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం :
**స్వాతంత్ర్య స్వర్ణభారతి**

# అమృతవాణి

"ప్రభూత సత్కారసమేతమేవ
స్వల్పం చ దానం బహుపుణ్యదం స్యాత్
ప్రతిగ్రహీతుర్హృదయే ప్రబుద్ధా
తుష్టిర్హి దత్తే సుకృతం న వస్తు"

- శ్రీ గణపతి సచ్చిదానంద

నీ విచ్చేది చాలా స్వల్పమైన వస్తువైనను సముచిత గౌరవాదర పూర్వకంగా ఇచ్చినట్లయితే అది దానం స్వీకరించిన వాని హృదయంలో పూర్ణ తృప్తిని కల్గిస్తుంది. ఆతని తృప్తియే నీకు పుణ్యాన్నిస్తుంది. కాని నీవిచ్చిన వస్తువు కాదు.

సామాన్యంగా దాతకు నిర్లక్ష్య భావం వుంటుందట. అది చాలా లోపం, దోషం కూడాను. నీ విచ్చే వస్తువు వెల యెంత అని కాదు. నీ విచ్చేది చిన్నది కావచ్చు, అయినా దానం తీసికొనే వానియందు మిక్కిలి గౌరవ భావంతో కనుక ఇస్తే ఆ గ్రహీత మనసులో చాలా తృప్తి చెందుతాడు. ఆ తృప్తియే నీకు పుణ్యం సంపాదించి పెడుతుంది. నీ విచ్చిన వస్తువు వల్ల కాదు పుణ్యం అతని తృప్తి వల్లనే పుణ్యం.

గొప్ప వస్తువిచ్చినా, అది గ్రహీతకవసరాన్ని తీర్చనప్పుడు పైగా నీవు అనాదరంగా ఇచ్చినప్పుడు అతనికి తృప్తినీయదు. అప్పుడు నీకు పుణ్యమేమీ రాదు.

దీని సారాంశమేమంటే ప్రతిగ్రహీత యందు గౌరవాదరాలతో దానం ఇస్తే దాతకు లాభంగాని నిర్లక్ష్యంగా ఇవ్వటం వల్ల కాదని. రంతిదేవుని కథ దీనికి చక్కని వుదాహరణం.

రంతిదేవుడు దయార్ద్ర హృదయం గల మహారాజు. ఆయన దగ్గరకు వెళ్ళి ఎలాంటి సహాయం కోరినా లేదనకుండా చేసేవాడు. తనకున్నది బీదసాదలకు పెట్టి తృప్తి పడేవాడు. అతన్ని యాచించిన వారెవ్వరూ నిరాశపడేవారుకారు.

ఇలా వుండగా ఆయన రాజ్యంలో ఒకసారి పెద్ద కాటకం వచ్చింది. ఆ కరువులో కూడా దాన ధర్మాలు విరివిగా చేసి బీదవారిని ఎంతగానో ఆదుకొన్నాడు. ఇలా వుండగా కొన్నాళ్ళకు ఆహారధాన్యాల కొరత యేర్పడింది. తన కుటుంబం కోసం మిగిలిన ఆహార పదార్థాలను కూడా దానం చేసి బీదల ఆకలి బాధ తీర్చగలిగాడు. ఉన్న ఆహారం అయిపోయింది. ఆయన భార్యా పిల్లలు నలుబదిరోజులు ఆహారం లేకుండా గడపవలసి వచ్చింది. నలుబదితొమ్మిదవ రోజున అదృష్టవశాత్తు వారికి ఒక గంజితో నిండిన పాత్ర లభించింది.

రంతిదేవుడు భగవంతునికి కృతజ్ఞత తెలిపి తినటానికి ఉపక్రమించబోతూండగా ఆకలిగొన్న ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. సరే అతన్ని సాదరంగా ఆహ్వానించి గంజి వడ్డించాడు. అతిధి ఆకలి తీరి తృప్తిగా వెళ్లిపోయాడు. అప్పుడాకలితో ఒక శూద్రుడు వచ్చాడు. అతన్ని కూడా గౌరవంగా పిలిచి కూర్చుండబెట్టి గంజి భోజనం పెట్టాడు. అతగాడు కూడా మిక్కిలి తృప్తితో వెళ్ళిపోయాడు. ఆ శూద్రుడట్లా వెళ్ళాడో లేదో మరో బిచ్చగాడు ప్రత్యక్షమయ్యాడు. అతనితో పాటు నాలుగు కుక్కలు కూడా వున్నాయి. ఏ మాత్రం కోపం విసుగు లేకుండా ఓర్పుతో ఆ బిచ్చగాణ్ణి ప్రేమతో పిలిచి అతనికి, నాలుగు కుక్కలకు కూడా రంతిదేవుడు గంజి పెట్టాడు. హాయిగా తృప్తిగా తిని బిచ్చగాడు తన కుక్కలతో వెళ్లిపోయాడు.

**కూచిభట్ల చంద్రశేఖర శర్మ**

ఇక మిగిలింది తిందామని రంతిదేవుడా గంజి పాత్రలోకి చూచాడు. ఏముంది, ఒక్క మెతుకు కూడా మిగలలేదు. అడుగున వట్టి నీళ్ళు కాసిని వున్నాయి. ఆ నీళ్లనే త్రాగి ప్రాణం నిలుపుకొందామనుకొంటూండగా దాహం దాహం అంటూ మరో బిచ్చగాడు వచ్చాడక్కడికి. అతని దయనీయ స్థితి చూసి రంతిదేవుడనుకొన్నాడు. "నాకు స్వర్గమూ వద్దు అష్టైశ్వర్యాలు వద్దు, నాకితరుల బాధ అర్థమై వారిబాధ తీర్చగల శక్తి, వారి సమస్యలను తీర్చగల శక్తి చాలు భగవంతుడా" అని భగవంతుని ప్రార్థించి ఆ గంజి నీరు ఆ బిచ్చగాడికి ఇచ్చాడు. అతడు ఆ నీరు త్రాగంగానే రాజుకున్న ఆకలి దప్పికలు, శక్తి హీనత అన్నీ పోయాయి.

అతని త్యాగనిరతికి సంతసించి లక్ష్మీదేవి ప్రపంచంలో సర్వ సంపదలను అతనికి అనుగ్రహించింది. కాని రాజు వాటినీ కాదన్నాడు. అతని మనస్సు భగవంతుని యందు ఎన్నడో లగ్నమైపోయింది. గొప్ప యోగిగా ముక్తుడయ్యాడు. ●

స్వర్ణోత్సవ వ్యాసం



# స్వాతంత్ర్య సమర సంగ్రామంలో త్యాగధనులు - అమర వీరులు

రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని కూకటివేళ్ళతో పెకలించివేయటానికి ఈ పవిత్ర భరత ఖండంలో బ్రహ్మాండమైన మహోద్యమం జరిగింది. వేలాదిమంది భరతవీరులు సంవత్సరాల తరబడి, బ్రిటీష్ వారి కారాగారాలలో మ్రగ్గిపోయారు. వారి తుపాకి గుండ్లకు ఎందరో బలియైపోయినారు. మరెందరో వీర కిశోరాలు ఉరికంబాలకెక్కి అశువులు బాసి అమరవీరులు అయినారు. "వందేమాతరం" నినాదం ఆనాటి యువలోకానికి ఊపును, ఉత్సాహాన్ని యిచ్చింది. లాలాలజపతిరాయ్, బిపిన్ చంద్రపాల్‌లు స్వాతంత్ర్య శంఖాన్ని పూరించి ప్రజానీకాన్ని మేల్కొల్పారు. "స్వాతంత్ర్యం నా జన్మ హక్కు" అని సింహగర్జన చేశాడు బాలగంగాధరతిలక్. వీరుడు నేతాజి "ఆజాద్ హింద్ ఫౌజ్" ను స్థాపించి, యువలోకాన్ని సమీకరించి, వారికి స్ఫూర్తిని, శక్తిని ప్రసాదించి, వారిచేత తిరుగుబాటు చేయించి ఆంగ్లేయులను హడలగొట్టాడు. వేలాదిమంది యువకిశోరాలు, కొదమసింహాలలాగే స్వాతంత్ర్య సంగ్రామంలోనికి కుప్పించి దూకారు. 24 సంవత్సరాల యువకిశోరం "భగత్‌సింగ్" నవ్వుతూ... నవ్వుతూ... ఉరికంబానికెక్కి ఉరిత్రాడును తగిలించుకొని "వందేమాతరం" అంటూ నేలకొరిగాడు. వీరుడు చంద్రశేఖర్ ఆజాద్ బ్రిటీషు దొరలను గడగడలాడించి, తోటి భారతీయులు పన్నిన కుట్రవలన బ్రిటీషు ముష్కరుల తుపాకి గుండ్లకు బలియై అమరవీరుడైనాడు. "సత్యాగ్రహం నా జన్మ హక్కు" అనే నినాదం ఇచ్చి, అహింసాయుధాన్ని చేబూని, చాకచక్యంగా, ప్రజానీకాన్ని ఒక త్రాటిమీద నడిపించి, బ్రహ్మాండమైన మహోద్యమాన్ని నిర్మించి, ఆంగ్ల దొరలను గడగడలాడించినాడు, కొల్లాయి కట్టిన మహాత్మాగాంధి. "బార్డోలి సత్యాగ్రహము"ను నడిపి రైతాంగమును సమీకరించి, వారిచేత భూమిశిస్తు కట్ట నిరాకరింపజేయించి తెల్లదొరలకు సింహస్వప్నమై "ఉక్కు మనిషి"గా పేరుగాంచాడు "సర్దార్ వల్లభాయ్ పటేల్". "దమ్ములుంటే నన్ను కాల్చండి!" అంటూ ఎదురు రొమ్మును చూపిస్తూ, వేలాది మంది ప్రజానీకంతో, మద్రాసు నగరంలో తెల్లదొరల తుపాకిగుండ్లకు ఎదురుగా నడిచాడు "ఆంధ్రకేసరి" టంగుటూరి ప్రకాశం పంతులు. దాదాభాయ్ నౌరోజీ, చిత్తరంజన్‌దాస్, డా. రాజేంద్రప్రసాద్, పండిత నెహ్రూ, శ్రీమతి సరోజినీ నాయుడు, వీర సావర్కార్, డా. పట్టాభి, ఆచార్యరంగా ఇంకా.. ఇంకా.. ఎందరో... ఎందరో... ఈ మహోద్యమానికి సారథ్యం వహించారు. ప్రజలను సమీకరించి బ్రిటీషు ప్రభుత్వానికి ఎదురుగా నడిపించారు. బ్రిటీషు వారి కారాగారాలలో

**కొమరగిరి కృష్ణమోహనరావు**

యమయాతనలనుభవించారు. కొందరు ఆ ముష్కరుల తుపాకి గుండ్లకు బలియై అమరవీరులైనారు. ఎట్టకేలకు చిట్టచివరికి భరతవీరుల త్యాగం ఫలించింది. రవి అస్తమించని సామ్రాజ్యానికి అధినేతలైన ఆంగ్లేయులు భరతదేశమును విడిచిపెట్టక తప్పలేదు. బ్రిటీష్‌సామ్రాజ్యం కూకటి వేళ్ళతో పెకలించి వేయబడింది. మహాత్మాగాంధీజీ ఆశించిన సంపూర్ణ స్వాతంత్ర్యం సమకూరక పోయి నప్పటికీ, పాక్షిక స్వాతంత్ర్యం లభించింది. బ్రిటీష్ వారి కుట్రతో భరతమాత ఖండించబడింది. అగ్రజ భాగం మనకు లభించింది. 1947వ సంవత్సరం ఆగష్టు 14-15 అర్ధరాత్రి వేళ మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. నేటికి 50 సంవత్సరాలు నిండి 51వ సంవత్సరం నడుస్తున్నది. ఈ జాతి ఈ సంవత్సరం స్వర్ణోత్సవాలను జరుపు కుంటున్నది. ఈ స్వర్ణోత్సవాల ముగింపు సందర్భమున అసలు ఈ దేశ స్వాతంత్ర్యమునకు మూలపురుషులయిన వారిని ఒక పర్యాయం స్మరించుకుని, వారికి నివాళు లర్పించుట సముచితమని భావించి ఈ వ్యాసమును 'శ్రీవాణి' పాఠకులకు సమర్పించుకుంటున్నాను. ముఖ్యులైన కొందరు స్వాతంత్ర్య సమరయోధుల జీవిత చరిత్రలలోని అతిముఖ్యమైన ఘట్టములను పాఠకులకు అందించటమే నా లక్ష్యం. ఈ దేశ స్వాతంత్ర్యం కోసం వారు చేసిన త్యాగాలు చిరస్మరణీయాలు. భావితరాలకు స్ఫూర్తిదాయకములు.

## డా॥ బాబూ రాజేంద్రప్రసాద్

అది పాట్నా మహానగరం. ఆ నగరంలో ఒక పెద్ద బంగళా. అందులో చాలా Guest Rooms ఉండేవి. వచ్చిపోయే వారితో ఆ బంగళా నిత్యమూ కళకళలాడుతూ ఉండేది. వచ్చిన వారందరికి ఉచిత భోజనం, ఉచిత వసతి. అంత మహానగరంలో ఇంతటి వసతి లభించటం అంత తేలిక కాదు. ఎవరి పనులు వారు పూర్తి చేసుకొని ఇండ్లకు తిరిగి వెళ్ళేటప్పుడు ఆ బంగళా యజమాని (Owner) వద్దకు వెళ్ళి "బాబుగారూ! వెళ్ళివస్తాం" అనేవారుట. అప్పుడు ఆయన "మీది ఏ ఊరు? ఎక్కడికి వెళ్లాలి? ఛార్జీలు ఉన్నాయా?" అని అడిగి ఛార్జీలు మరియు ఇతర ఖర్చులు కూడా యిచ్చి పంపించేవారుట. అటువంటి ధనవంతుడు, త్యాగశీలి గాంధీజీ పిలుపునందుకుని, సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళే ముందు, తన భార్యను పిలిచి "నా వద్ద ఉన్నవి తొమ్మిది రూపాయలు మాత్రమే. ఇవి తీసుకో! నేను ఎప్పుడు తిరిగి వస్తానో నాకే తెలియదు." అని చెప్పి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనటానికి వెళ్ళిపోతాడు. అతనే డా॥ బాబూ రాజేంద్రప్రసాద్. భారతదేశ ప్రథమ రాష్ట్రపతి. 1920వ సంవత్సరంలో రౌలట్ యాక్టుకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని ప్రారంభించాడు గాంధీజీ. బీహారు సత్యాగ్రహ దళానికి రాజేంద్రప్రసాద్‌ను నాయకుడుగా నియమించారు గాంధీజీ. ఆ ఉద్యమంలో ఆయన చూపిన త్యాగానికి, చాకచక్యానికి ప్రజలు ముగ్ధులై పోయినారు. ఆనాటి నుంచి ఆయనను 'బీహార్ గాంధి' అని పిలువసాగారు. న్యాయవాదవృత్తి ద్వారా ఆయన ప్రతి నెలా వేలాధి రూపాయలు సంపాదించేవారు. అటువంటి ఆదాయం గల వ్యక్తి సత్యాగ్రహానికి వెళ్ళేటప్పుడు కేవలం తొమ్మిది రూపాయలు మాత్రమే తన భార్యకు యివ్వగలిగాడంటే ఆశ్చర్యం వేయక మానదు. ఆనాడు ఆ మహనీయులు ఆ విధంగా త్యాగం చేసారు కాబట్టే మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. అయితే ఈనాటి నాయకులు చెట్టుపేరు చెప్పుకుని కాయలు అమ్ముకుంటున్నారు. చెట్టు నాటేది ఒకరు, పోషించేది ఇంకొకరు. దాని ఫలితం అనుభవించేది మరొకరు. ఈ సత్యం ఈనాడు ఋజువవుతున్నది.

## సర్దార్ వల్లభాయ్ పటేల్

మాజీ రక్షణ మంత్రి శ్రీ మహావీర్ త్యాగి ఒక పర్యాయం, అప్పటి ఉపప్రధాని "సర్దార్" శ్రీ వల్లభాయ్ పటేల్ ఇంటికి వెళ్లాడు. అక్కడ "సర్దార్" కూతురు 'మణీబేన్'ను చూస్తాడు. ఆమె మాసికలు వేసిన ధోవతిని చీరెగా కట్టుకొని ఉంటుంది. త్యాగి ఆశ్చర్యంతో, "మణీబెన్! ఇంత గొప్ప వ్యక్తి కూతురువై ఇటువంటి మాసికలు చీరె కట్టుకోవటం ఏం బాగుంది? నీవు ఒక వేళ ఈ చీరెతో బజారుకు వెళ్లితే బిచ్చపుదానవనుకుని అందరూ నీకు బిచ్చం వేస్తారు" అని అంటాడు. అప్పుడు మణీబెన్ కోపంతో "అవినీతి సంపాదనతో సిగ్గుపడాలిగాని, మేం కష్టపడి సంపాదించే వాళ్ళం. మేం సిగ్గుపడాల్సిన పనిలేదు.' అని అంటుంది. ప్రక్కనే ఉన్న పటేల్ నవ్వుతూ త్యాగితో "మంచిదే గదా! చాలా పైసలు పోగొతాయన్నమాట!" అని చమత్కరిస్తాడు. అక్కడనేనున్న సుశీలానయ్యర్ కల్పించుకొని "త్యాగీజీ! మీరు ఎవరితో మాట్లాడుతున్నారు? మణీబెన్ సంగతి మీకు తెలియదు. ఆమె రోజంతా సర్దార్‌జీ సేవ చేస్తుంది. తరువాత దినచర్య వ్రాస్తుంది. తదుపరి నియమంగా రాట్నం వడుకుతుంది. దానితో వచ్చిన దారంతో సర్దార్‌జీ ధోవతి, చొక్కా తయారవుతాయి. సర్దార్‌జీ మీలాగే ఖాదీ భండారుకు వెళ్ళి బట్టలు కొనుక్కోరు. సర్దార్‌జీ ధోవతి చినిగిపోయిన తరువాత, మాసికలు వేసుకుని, దానిని మణీబెన్ చీరెగా కట్టుకుంటుంది. చినిగిపోయిన చొక్కాను కత్తిరించి రవికగా కుట్టుకుంటుంది." అని చెబుతుంది. ఇది విని మహావీర్‌త్యాగి తాను చేసిన పొరపాటుకు పశ్చాత్తాపపడి సిగ్గుతో తలవంచు కుంటాడు. ఈ ఉదంతం పటేల్ మరియు మణీబేన్‌ల నిరాడంబరతను తెలియ జేస్తాయి. భారతదేశ ఉపప్రధానిగా వుంటూ కూడా, ప్రభుత్వ సొమ్మును దుబారా చేయకుండా ఎట్టి అవినీతికి పాల్పడకుండా, ఆదర్శమైన జీవితాన్ని గడిపి భావితరాలకు మార్గదర్శకుడైనాడు పటేల్. అంతేకాదు వ్యక్తి ప్రతిభను చాటేది, ప్రతిష్ఠను పెంచేది బట్టలు కావని, అలంకారాలు అంతకన్నా కావని, అతని నిరాడంబరత, సౌశీల్యం మాత్రమే శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను సముపార్జించి పెడుతాయని నిరూపించాడు పటేల్.

మోయలేని భారాన్ని రైతులమీద మోపింది. బ్రిటీష్ ప్రభుత్వం. 30 సంవత్సరాల పాటు అదనపు భూమి శిస్తును చెల్లించాలని ఆంగ్ల ప్రభుత్వం ఆదేశించింది. ఆ భారాన్ని మోయలేక, చెల్లించలేక, దిక్కుతోచక పటేల్ వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు బార్డోలి రైతులు. ఆయన గ్రామ గ్రామాన తిరిగి రైతులను సమీకరించి, ఏకత్రాటిక్రిందకు తీసుకొని వచ్చాడు. రైతులు పన్నులు కట్టనిరాకరించారు. వేలాది మంది రైతులను కారాగారాలకు పంపారు. రైతుల పొలాలను జప్తు చేసి ఇతరులకు అమ్మాలని ప్రభుత్వం

ప్రయత్నించింది. "బార్డోలి రైతుల భూములలో అడుగు పెడితే ప్రాణాలతో తిరిగి వెళ్ళరు" అని పటేల్ వారిని హెచ్చరించాడు. ఆ భూములను కొనటానికి ఎవరూ ముందుకు రాలేదు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆ ప్రాంతంలో కలెక్టర్ గారికి కూడా గుర్రం బగ్గీ దొరకటం దుర్లభమైంది. ఇదే రకమైన ఉద్యమం దేశం మొత్తం వ్యాపించుతుందేమోనని ఆంగ్ల ప్రభువులు భయపడి పోయినారు. చిట్టచివరకు గత్యంతరం లేక ప్రభుత్వం దిగివచ్చి పటేల్‌తో సంప్రదించింది. పెంచిన భూమిశిస్తును తగ్గించక తప్పలేదు. అక్కడివారు అప్పటి నుంచి పటేల్‌ను 'బార్డోలి సర్దార్' అని పిలవనారంభించారు.

చిన్నప్పుడు పటేల్ స్కూలులో చదువుకునేటప్పుడు ఒక చిన్న సంఘటన జరిగింది. "ఎక్కడ కొన్నావురా! ఈ పుస్తకం?" అని ప్రశ్నించాడు ఉపాధ్యాయుడు. "బజారు కొట్లోనండి" అన్నాడు బాల పటేల్. నా దగ్గర కొనాలని నీకు తెలియదా?" అని ప్రశ్నించాడు ఆ ఉపాధ్యాయుడు. "మీ దగ్గర చదువుకునేందుకు గాని, బేరసారాలు చేయడానికి కాదండీ! నేను బడికి రావడం" అని నిర్భయంగా సమాధానం యిచ్చాడు పటేల్. ఆ జవాబు విని ఆ ఉపాధ్యాయుడు ఉలిక్కి పడ్డాడు. అయినా గంభీరంగా "ఇదిగో! ఈ సారి ఇతరత్రా పుస్తకాలు కొన్నావో! నిన్ను బడికిరానివ్వను తెలిసిందా?" అన్నాడు ఆ ఉపాధ్యాయుడు. "మీకా కష్టం ఎందుకులేండి! నేనింక బడికి రానుసార్!" అన్నాడు పటేల్. ఉపాధ్యాయుడు నిర్ఘాంతపోయాడు. ఆ మరునాడు అతనే కాదు. ఆ తరగతి పిల్లలెవరూ రాలేదు. పురప్రముఖులు జోక్యం చేసుకుని అందరినీ శాంత పరచారు. అందరూ బడికి వెళ్లారు. ఆ బాలునికి భయభక్తులు లేవని కొందరు వాదించవచ్చు. కాని అతడు అటువంటి వాడు కాదు. అన్యాయాన్ని నిర్భయంగా ఎదిరించడం అతని మనస్తత్వం కాని వేరు కాదు.

పటేల్ పదవికోసం ఏనాడు పరుగెత్తలేదు. ప్రథమ భారత ప్రధానమంత్రిగా పటేల్ ఉండాలని, ఆనాడు ఉన్న మొత్తం 15 రాష్ట్రాలలో 12 రాష్ట్రాలవారు బలపరిచారు. అయినప్పటికి గాంధీజీ జోక్యంతో పండిత నెహ్రూ ప్రథమ ప్రధానమంత్రి పీఠాన్ని అలంకరించాడు. అయినప్పటికీ పటేల్ ఏమాత్రం విచారించలేదు. కర్తవ్యపాలనను విస్మరించలేదు. 500 స్వదేశీ సంస్థానాలను భారత్ రిపబ్లిక్‌లో విలీనం చేసిన ఉక్కుమనిషి Iron Man of India సర్దార్ వల్లభాయ్ పటేల్. నాటికీ, నేటికి, ఏనాటికి భారత ప్రజల హృదయాలలో శాశ్వతమైన స్థానం ఆ మహనీయునికి ఉన్నది.

## బాలగంగాధర తిలక్

ఈ రోజులలో మనుష్యులు సాధించేది స్వల్పమయినా అట్టహాసం మాత్రం జాస్తి. చేసే పని నామమాత్రం, ఉపకరణాల మీద మోజు అధికం. చేసే పని తక్కువ, డాబుసరి ఎక్కువ. ఒకప్పుడు బొంబాయిలో 'రాష్ట్రమాత' పత్రిక ప్రారంభిస్తున్నారు. బల్లలూ, కుర్చీలు, బీరువాలు, ఫ్యానులు అత్యవసరమని నిర్వాహకులు Estimation తయారుచేస్తున్నారు. ఆ సమయంలో కాకతాళీయంగా అక్కడకు వచ్చిన బాలగంగాధర తిలక్ వారి సంభాషణలు విని 'మేము కేసరి, మరాఠా పత్రికలు ప్రారంభించినప్పుడు, ఇలాంటి సరంజామా ఏదీ మా దగ్గర లేదు. మీరు ఇప్పుడు అవసరమని భావింపబడే ఉపకరణాలు ఏవీ లేవు. పరుపు చుట్టను చుట్టి, దానినే బల్లగా చేసుకుని రచనలు సాగించేవారం. అలా వ్రాసినప్పటికీ, ఆ రచనలు ప్రజలలోఉత్సుకతను, చైతన్యమును, స్ఫూర్తిని కలిగించాయి.' అని అన్నారు. అక్కడి వారంతా బదులు చెప్పలేక మెదలకుండా ఉండిపోయారు. మహనీయులకు బాహ్య ఉపకరణాలతో నిమిత్తం లేదు. ఆడంబరాలకు, అట్టహాసాలకు ప్రాధాన్యత యివ్వకుండా, కార్యాన్ని సాధించడమే వారి జీవిత పరమావధి. ఇప్పటి వారా! పనిచేయటం తక్కువ. అట్టహాసం ఎక్కువ. "పటారం కన్నా ప్రతిభే మిన్న" అన్న విషయాన్ని విస్మరించరాదు.

తిలక్ హైస్కూల్‌లో చదివే రోజులలో ఒక చిన్న సంఘటన జరిగింది. ఒక రోజున ఎవరో కొందరు విద్యార్థులు వేరు శనక్కాయలు తిని ఆ పొట్టు క్లాసురూంలో పడవేశారు. కాగితాల ముక్కలు విరజిమ్మారు. ఆ తరగతి పంతులుగారు వచ్చి "ఎవరా పనిచేసింది?" అని ప్రశ్నిస్తాడు. ఎవరూ సమాధానం చెప్పలేదు. పంతులు గారికి కోపం వస్తుంది. గదంతా శుభ్రంగా ఊడవండని ఆజ్ఞాపిస్తాడు. అందరూ ఊడుస్తుంటారు. కాని ఒక విద్యార్థి మాత్రం ఆ పని చేయకుండా నిలుచుని ఉంటాడు. పంతులు గారికి కోపం వస్తుంది. బెత్తం తీసుకొని వస్తాడు. నిర్భయంగా నుంచొని వున్న ఆవిద్యార్థిని చేయి చాపమని హూంకరిస్తాడు. చేయి చాప నిరాకరిస్తూ "నేను శనక్కాయలు తినలేదు. కాగితాలు చించి పారవేయలేదు. అందువలన నేను ఊడవను" అని నిర్భయంగా సమాధానం చెబుతాడు. ఆ సమాధానమునకు కోపోద్రిక్తుడైన ఆ పంతులుగారు ఆ పిల్లవాడిని పాఠశాల నుండి గెంటివేస్తాడు. ఆ బాలుడెవరో తెలుసా? "స్వరాజ్యం

నా జన్మహక్కు" అని గర్జించిన బాలగంగాధర తిలక్.

1908 వ సం॥ జూన్ 24న బర్మాలోని మాండలే జైలుకు తిలక్‌ను పంపుతుంది ఆంగ్ల ప్రభుత్వం. జైలులో ఉన్న ఆరు సంవత్సరాలలో భగవద్గీతకు మహారాష్ట్ర భాషలో చక్కని వ్యాఖ్యను వ్రాస్తాడు తిలక్. దాని పేరే 'గీతారహస్యం' విడుదల అయ్యేటప్పుడు ఆ వ్రాత ప్రతిని ఇంటికి తీసుకుని పోవటానికి జైలు అధికారులు నిరాకరిస్తారు. అప్పుడు తిలక్ "కాగితం మీద వ్రాసింది తీసుకోగల్గుతారు గాని మనస్సులో భావాలను తీసుకోలేరు గదా!" అని ఆ అధికారుల మొహాన ఆ వ్రాత ప్రతిని విసిరి పారేసి బయటకు వస్తాడు. ఈ సంఘటన ఆయన ఆత్మ విశ్వాసాన్ని, స్వాభిమానాన్ని ఋజువు చేస్తుంది.

మాండలే జైలులో శిక్ష అనుభవిస్తున్న తరుణంలో ఆయన భార్య మరణిస్తుంది. ఆమె మృతదేహాన్ని చూడటానికి కూడ ఆంగ్ల ప్రభుత్వం అంగీకరించదు. అంత్యక్రియలకు వెళ్ళటానికి అనుమతించలేదు. 46 సంవత్సరాల పాటు ఆమెతో కలిసి సహజీవనం నెరిపిన తిలక్ మహాశయునికి ఆమె మృత శరీరమును చూచే భాగ్యం కూడా లేకుండా పోయింది. అయినప్పటికీ ఆయన ఏ మాత్రం చలించలేదు. ఆయన ఆత్మ విశ్వాసం సడలలేదు. మమకార బంధనాలను త్యజించి స్వాతంత్ర్యం కోసం విశ్రాంతి లేని నిరంతరపోరాటం సలిపిన మహాయోధుడు బాలగంగాధర తిలక్.

## భగత్ సింగ్

అది 1931 మార్చి 23వ తేది సాయంత్రం. చీకటి పడిన తరువాత జైలులో భగత్‌సింగ్ ఉన్న గదికి వెళ్ళి జైలర్ 'Are You Ready' అంటారు. 'Yes! I am Ready' అని నవ్వుతూ సమాధానం యిస్తాడు భగత్ సింగ్. జైలు ఆవరణలో వెనుక భాగాన భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను ఉరితీయటానికి ప్రత్యేకంగా ఒక గద్దెను నిర్మిస్తారు. జైలు గదుల నుండి సాయుధ భటులు ఆ మరణశయ్య మీదకు తీసుకుని వెళుతుంటే ఆ ముగ్గురు యువకిశోరాలు "ఇంక్విలాబ్ జిందాబాద్", 'వందేమాతరం' అంటూ నినాదాలు యిస్తూ ముందుకు నడుస్తుంటారు. మరుక్షణంలో తమ ప్రాణాలు కోల్పోతామని వారికి బాగా తెలుసు. అయినప్పటికీ వారి ముఖాల మీద చిరునవ్వు తాండవిస్తూనే ఉంటుంది. తమ వీర మరణంతో, దేశ ప్రజలు ఉత్తేజితులై స్వాతంత్ర్య సమర సంగ్రామంలో పాల్గొనాలని వారి ఆకాంక్ష. ఆ ఆశయంతోనే తమ జీవితాలను ఆత్మార్పణ చేశారు. ఆంగ్లేయులను గడగడలాడించిన ఆ ముగ్గురు వీర కిశోరాలను బలిపీఠమెక్కించారు. చివరిసారిగా తల్లి భారతికి వినమ్రులై నమస్కరించారు. అక్కడనే ఉన్న సీనియర్ ఆంగ్ల జైలర్ వైపు వేలు ఎత్తి చూపుతూ భగత్ సింగ్ "మీరు చాలా అదృష్టవంతులు. భారత స్వాతంత్ర్య సంగ్రామ సైనికులు నిర్భయంగా, నవ్వుముఖంతో, మృత్యువునెలా ఆహ్వానిస్తారో! కళ్ళారా చూచే అవకాశం ఈనాడు మీకు లభించబోతున్నది. మేము మీకు అది చూపిస్తాం" అని అంటాడు. సరీగా గం॥ 7-20 ని॥లకు ఆ యువకిశోరాల ముఖాలకు నల్లటి ముసుగులు వేయబడుతాయి. ఆ ముగ్గురు ఒకరినొకరు మనసారా గాఢంగా ఆలింగనం చేసుకుని "ఇంక్విలాబ్ జిందాబాద్" అని బిగ్గరగా నినాదం చేస్తారు. మరుక్షణంలో ఆ విప్లవ వీరశిరోమణుల మెడలచుట్టూ ఉరిత్రాడు చుట్ట బడుతుంది. "వందేమాతరం" అంటూ ఆ ముగ్గురూ ఒకే పర్యాయం సింహగర్జన చేస్తారు. సరీగా గం॥ 7-27 ని॥లకు ఆ బలి వేదిక క్రింద కొయ్య పలక 'టక్' అని శబ్దం చేస్తూ ఊడిపడుతుంది. ఆ విప్లవ వీర కిశోరాల పంచ ప్రాణాలు అనంతాకాశంలో విలీనమైపోతాయి.

## చంద్రశేఖర్ ఆజాద్

" నీ పేరు ఏమిటి." అని అడుగుతాడు న్యాయాధికారి. " నా పేరు ఆజాద్" (ఆజాద్ అంటే స్వేచ్ఛ) అని నదురు బెదురు లేకుండా సమాధానం యిస్తాడు 14 సంవత్సరాల బాలుడు. " నీ తండ్రి పేరు ఏమిటి?" అని మరల అడుగుతాడు ఆ న్యాయాధీశుడు. ఆ బాలుడు చిరునవ్వుతో "స్వాధీన్" (స్వాధీన్ అంటే స్వాతంత్ర్యం) అని సమాధానం చెబుతాడు. న్యాయాధీశునికి కోపం వస్తుంది. అయినప్పటికీ తమాయించుకుని "సరీగా చెప్పు! నీ గృహం ఎక్కడ" అని అడుగుతాడు. "నా గృహం... కారాగృహం" అంటాడు ఆ బాలుడు. ఆ న్యాయాధీశుడు 16 బెత్తం దెబ్బలు శిక్ష విధిస్తాడు. 1921వ సం॥ డిశంబరు 28వ తేదీన కోర్టు శిక్ష అమలుచేయబడుతుంది. ఆ బాలుని శరీరం మీద ఉన్న అన్ని గుడ్డలు (లంగోటి మినహా) ఊడదీస్తారు. చేతులు రెండు పైకెత్తి త్రాడుతో బిగించి కడుతారు. భీముడిలాంటి జైలు జమాను బెత్తం ఆడిస్తూ ఆ పసిబాలుడి మీద దూకి బెత్తంతో దెబ్బలు కొడుతుంటాడు. శరీరం చిట్లి రక్తం ప్రవహిస్తుంటుంది. దెబ్బపై దెబ్బ పడుతుంది. ఆ బాలుడి నోటి వెంబడి ఏడుపు కాదు వచ్చేది "భారత మాతాకీ జై" అనే సింహగర్జన. ఆ సింహగర్జనతో జైలంతా

ప్రతిధ్వనిస్తుంది. 16 దెబ్బలు ఆ బాలుని మీద పడుతాయి. ఒళ్ళంతా రక్తసిక్తమైపోతుంది. "వందేమాతరం" అని గర్జిస్తూ ఆ బాలుడు మూర్చిల్లుతాడు. త్రాళ్లతో చేతులు కట్టి వ్రేలాడదీసి వుండటం వలన, మాతృభూమి ఒడిలో విశ్రాంతి తీసుకునే అవకాశం లేక స్పృహతప్పి వ్రేలాడుతాడు. మరుసటి రోజు ఉదయం జైలునుండి పంపేముందు, జైలు అధికారి, వారి సంప్రదాయం ప్రకారం ఆ బాలుడి చేతిలో మూడు అణాలు పెడుతాడు. ఆ బాలుడు ఆ డబ్బులను చేతిలో పట్టుకుని ఒక్క క్షణం చూస్తాడు. ఆ చేతిలో వున్న మూడు అణాలలో మాతృదేవి బానిస అయిన దృశ్యం అతనికి కనిపిస్తుంది. వెంటనే ఆ డబ్బులను నేలకేసి కొట్టి "వందేమాతరం" అని గర్జిస్తాడు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు గౌరీ శంకర శాస్త్రిగారు వచ్చి ఆ బాలుని ఇంటికి తీసుకుని వెళ్ళి గాయాలకు కట్టు కట్టి, మందులిచ్చి భోజనం పెడుతాడు. మరుక్షణం ఆ విషాదవార్త కాశీనగరమంతా వ్యాపిస్తుంది. ఆ బాలుని చూడటానికి వేలాదిమంది వస్తారు. ఆ సాయంకాలానికే బ్రహ్మాండమైన బహిరంగ సభ ఏర్పాటు చేస్తారు. "వందేమాతరం" నినాదాలు మిన్నుముట్టుతాయి. ఆ బాలుని ధైర్య సాహసాలను మెచ్చుకుంటూ నాయకులు ప్రసంగిస్తారు. ఆనాటి నుండి ఆ బాలుని 'ఆజాద్' అని పిలువ నారంభించారు. అతనే బాలవీర విప్లవ శేఖరం "చంద్రశేఖర ఆజాద్"

అది 1931 ఫిబ్రవరి 27వ తేది. ఆజాద్ సుఖదేవ్ రాజ్‌తో కలిసి ఆల్‌ఫ్రెడ్ పార్క్‌లోని ఒక చెట్టు క్రింద కూర్చొని భవిష్యత్తు కార్యక్రమాన్ని చర్చిస్తుంటారు. ఆజాద్ అనుచరుడే డబ్బుకాశపడి పోలీసులకు ఈ సమాచారం అందజేస్తాడు. పోలీసు అధికారులు నాలుగు వ్యానులలో గట్టి బందోబస్తుతో వచ్చి ఆ పార్కును ముట్టడిస్తారు. పోలీసుఅధికారి 'నాట్ బావర్' కారు ఆ పార్కులోనికి దూసుకుని వస్తుంది. 'ఆజాద్'ను చూచిన వెంటనే ఆ అధికారి రివాల్వర్‌తో కాలుస్తాడు. ఆ గుండు ఆజాద్ కుడి తొడలో చిక్కుకుంటుంది. తొడనుండి రక్తం చిమ్ముతుంది. దెబ్బతిన్న ఆజాద్ సింహంలా గర్జిస్తూ తన జేబులోని పిస్తోలును తీసి 'నాట్‌బావర్' చేతికి గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కుతాడు. రయ్యిన పోయి అతని కుడిచేతిలో దిగబడుతుంది. అతను పారిపోతాడు. మరో అధికారి వస్తాడు. అతనికి కూడా గురిపెట్టి కాలుస్తాడు. అతని దవడకు గుండు తగలగా కేకలు వేస్తూ పారిపోతాడు. ప్రక్కనే ఉన్న సుఖదేవ్‌రాజ్ పారిపోదామని ఆజాద్‌కు సలహా యిస్తాడు. అతను సుతరాము అంగీకరించక "పిరికి పందలా ప్రాణం కోసం పారిపొమ్మని సలహా యిస్తున్నావా!" మిత్రమా! ఈ ఆజాద్ భీరువు కాడు. స్వేచ్ఛలేని ఈ శరీరం కూలిపోతేనేం? నేను నమ్మిన సిద్ధాంతం కోసం, ఈ దేశ స్వాతంత్ర్యం కోసం ఆఖరి క్షణం వరకూ ఈ పవిత్ర వీరభూమి మీదనే నిలబడి పోరాడుతూ ప్రాణాన్నయినా వదలుతానుగాని, నేనెన్నటికి పారిపోను. స్వేచ్ఛా వాయువులను పీల్చలేని ఈ శరీరం కూలిపోతేనేం! సుఖదేవ్‌రాజ్! ఈ అశాశ్వతమైన ప్రపంచంలో ప్రతిదీ, ఏదో ఒక రోజున నశిస్తుంది, మాయమవుతుంది, కాలగర్భంలో కలిసిపోతుంది. అయితే నేనలా చరిత్ర హీనుణ్ణి కావాలని కోరుకోవటం లేదు. ఈ అశాశ్వతమైన భౌతికశరీరాన్ని రక్షించుకునేందుకు, శాశ్వతమైన అపఖ్యాతి తెచ్చిపెట్టేపని చేయమంటావా? మిత్రమా! అది ఈ జన్మలో జరుగదు. ఒక పవిత్రమైన ఆశయం కోసం, ఒక మహోత్కృష్టమయిన ఆదర్శం కోసం, అవసరమైతే మరణించటంలోనున్న ఆనందం, అనుభూతి, సంతృప్తి ఇంకెందులో ఉంటుంది? జాతిని జాగృతం చేయటానికి ఎంతైనా త్యాగం చేస్తాను, అవసరమైతే మరణిస్తాను. భావితరాల వారికి స్ఫూర్తిని, శక్తిని ధైర్యాన్ని యివ్వడాని కోసం, నా సర్వస్వాన్ని భరతమాత పాదపద్మములకు సమర్పిస్తాను. భారతదేశం సజీవమవుతుంది. శతాబ్దాల తెల్లదొరల పరిపాలన పీడన నుండి విముక్తి చెందుతుంది. భరతమాత సంకెళ్లు పటాపంచలైపోతాయి. ఇదే నా ఆకాంక్ష. అదే నా తుదికోరిక' అని ఆజాద్ స్పష్టం చేస్తాడు.

బ్రిటీష్ పోలీసులు చుట్టు ముడుతారు. తన సర్వశక్తిని కూడగట్టుకొని లేస్తాడు. అడుగులు తడబడుతూ ఉంటాయి. శరీరం నుండి రక్తం, కన్నుల నుండి కన్నీరు ప్రవహిస్తూ ఉంటుంది. తడబడుతున్న మాటలు నోటి వెంబడి వినపడుతూ ఉంటాయి. "నా దేశానికి స్వాతంత్ర్యం వచ్చి తీరుతుంది. ఓ భరతవీరులారా! . అప్పుడే విశ్రమించకండి! విప్లవోద్యమాన్ని చల్లారనివ్వకండి!" అని గొణుగుతాడు. క్రిందపడుతూ లేస్తూ "అమ్మా! భరతమాతా! నీ దాస్యశృంఖలాల నుండి నిన్ను విముక్తి చేయకుండానే నీ బిడ్డ వెళ్ళిపోతున్నాడమ్మా! నాకా యోగ్యత లేదమ్మా! క్షమించవూ!" అంటూ విలపిస్తూ "వందేమాతరం" అంటూ పిస్తోలును తన కణతకు గురి పెట్టుకొని పేల్చుకుంటాడు. కుప్పగా కూలిపోతాడు. "ఒరిగిపోయె, కూలిపోయె, ధాత్రిలో కలిసిపోయె", వీర విప్లవ శేఖరం - చంద్రశేఖర ఆజాద్.

## డా॥ భోగరాజు

ఒకనాడు డా॥భోగరాజు పట్టాభి సీతారామయ్యా గారిని ఒక మిత్రుడు అల్పాహారమునకు ఆహ్వానిస్తాడు. అక్కడ డా॥ పట్టాభిగారు ఆ అల్పాహారవిందులోని ఐటెమ్స్‌ను గురించి చమత్కారంగా వ్యాఖ్యానిస్తారు. వారి మాటలు పైకి చమత్కారంగా వినిపించినా ఆ మాటలలో స్వదేశీ అభిమానం ఉట్టిపడుతూ ఉంటుంది.

"ఇచ్చే కాఫీ ఫ్రెంచిది, చక్కెర జావాది, కలిపేది ఆస్ట్రేలియన్ టిన్‌మిల్క్, త్రాగేది జపాన్ కప్పుతో, కలియ బెట్టేది జర్మన్ స్పూన్‌తో, మరగకాచేది అమెరికన్ స్టౌ పైన, కాగబెట్టేది బర్మా ఆయిల్‌తో, తినేది గ్లాస్కో బిస్కట్లు, టేబుల్‌పైన పరచిన గుడ్డ లాంకషైర్ మిల్లుది, తుడుచుకునే చేతిరుమాలా టర్కిష్ నాప్‌కిన్, కాలిక్రింద వేసిన కార్పెట్ డెన్మార్క్‌ది, ఎదురుగా ఉండే అద్దం బెల్జియంది, ఇకపోతే వాటిల్లో ఉండే స్వదేశీయం కేవలం నీరు, మాత్రమే" అని డా॥ పట్టాభి హాస్యంగా అనడంతోనే అక్కడ వున్న మిత్రులందరూ ఆశ్చర్యపోతారు. డా॥పట్టాభి గారి స్వదేశీ అభిమానానికి ఇది ఒక మచ్చుతునక.

## చిత్తరంజన్ దాస్

ఒకనాడు ఒక పేద గృహస్థు వచ్చి తన కూతురు పెండ్లికి ధనసహాయం అర్థిస్తాడు చిత్తరంజన్ దాస్. దాస్ కోర్టుకు వెళ్ళుతూ, సాయంత్రం రమ్మనమని చెబుతాడు. ఆరోజు సాయంత్రం ఇల్లు చేరగానే ఇంటి వద్దనే కాచుకొని వున్న ఆ గృహస్థుని పిలిచి ఆ రోజు వచ్చిన ఆదాయము నంతా ఇచ్చివేస్తాడు. ఆ మొత్తం లెక్కించుతే రూ॥ 1500/- లు ఉంటుంది. ఆ పదిహేనువందల విలువ ఇప్పుడు ఎన్నివేలో! దాస్ ఒకనాడు తన గుర్రపు బగ్గీలో బజారుకు వెళ్ళుతుండగా ఒక ఇంట్లో నుంచి రోదన ధ్వని వినిపించింది. బగ్గీని ఆపి దిగి విషయం తెలుసుకుంటాడు. తన చిన్ననాటి ఉపాధ్యాయుడు అప్పు చెల్లించలేక పోవటం చేత ఇల్లు వేలం వేస్తున్నారు. అప్పుడు దాస్ ఆ సొమ్ము వడ్డీతో సహా చెల్లించి ఆ ఉపాధ్యాయునికి ఆ ఇంటిని దక్కించాడు.

చిత్తరంజనుడు భోగి, యోగి, త్యాగి. ఆ రోజులలో ఆయన ఏడాది ఆదాయం కనీసం 10 లక్షలు ఉండేదట. దేశం మొత్తం మీద ఇంత మొత్తం ఆదాయం వచ్చే న్యాయవాది ఆనాడు ఇంక ఎవరూ లేరట. 1919వ సం॥లో గాంధీజీతో పరిచయం ఏర్పడిన తరువాత, కాంగ్రేసు సంస్థలో చేరి అంతులేని ఆదాయం యిస్తున్న తన లాయర్ వృత్తిని త్యజించాడు. తన యావదాస్తినీ, తన సువిశాల సౌధాన్ని దేశానికి అంకితం చేశాడు. తన ప్రాసాదంలో మెడికల్ కాలేజిని, మహిళలకు ఆసుపత్రిని నెలకొల్పారు. జాతీయ ఉద్యమాన్ని పటిష్టం చేయడాని కోసం బెంగాల్ అంతటా పాఠశాలలను స్థాపించారు. ఢాకాలో యూనివర్శిటీని స్థాపించారు. కలకత్తాలో జాతీయ కళాశాలను స్థాపించి అరవిందఘోష్‌ను మొదటి ప్రిన్సిపాల్‌గా నియమించారు. ఈ సంస్థలకు ఆనాడు చిత్తరంజన్ ఎన్ని లక్షలు దానం చేశాడో! పుట్టుభోగి అయిన చిత్తరంజన్ తన భోగ భాగ్యములను విడనాడి అతి సామాన్య జీవితాన్ని అలవాటు చేసుకున్నారు. ఇలా అవిరళ త్యాగాన్ని చేసిన దీనబంధును " దేశబంధు" గా ప్రజలే పిలువనారంభించారు. కలకత్తా మహానగరానికి ప్రప్రధమ మేయర్‌గా చిత్తరంజన్ ఎన్నికైనారు.

అద్వితీయ త్యాగమూర్తి, మహా మేధావి, అసమాన న్యాయవాది, బీదలపాలిటి కల్పతరువు అయిన దేశబంధు చిత్తరంజన్‌దాస్ 1925వ సం॥ జూన్ 16వ తేదిన పరమపదించారు. ఆ శవవాహకులలో ఒకరు గాంధీజీ కావటం దాస్ ఎంతటి త్యాగమూర్తియో ఊహించవచ్చును.

మహాభోగాన్ని అనుభవిస్తూ, దేశ స్వాతంత్ర్య సముపార్జనకు తమ సర్వస్వాన్ని సమర్పించి, త్యాగం చేసి చివరి రోజులలో దారిద్ర్యాన్ని అనుభవించిన ఘనులలో 'దేశబంధు' చిత్తరంజన్ దాస్‌ది అగ్రస్థానం అయితే, ద్వితీయస్థానం 'ఆంధ్రకేసరి' ప్రకాశం గారిది కావటం విశేషం.

'దేశబంధు' భౌతిక కాయం అగ్నిజ్వాలలకు ఆహుతి అయిన సమయంలో ఏర్పాటు చేసిన స్మారక సభలో గాంధీజీ ప్రసంగిస్తూ " దేశబంధు కాయం నశించినప్పటికీ, ఆయన ఆత్మ అమరమైనది. అంతేకాదు ఎంతో త్యాగం, సేవ చేసిన ఆయన పేరు కూడా చిరస్థాయిగా నిలుస్తుంది. ఆయన సేవానిరతి, త్యాగగరిమి నిరుపమానం. ఆయన స్మృతి మనలో చిరకాలం నిలిచి పోవుగాక ! ఆయన జీవితం మనకు మహత్కార్య సాధనకు మార్గదర్శకంగా ఉండుగాక! ఆయన ఆత్మకు శాంతి కలుగుగాక !" అంటారు

చిత్తరంజన్ ఆదర్శ కర్మయోగి. " కర్మణ్యే వ్యాధి కారస్తే మాఫలేషు కదాచన" అన్న గీతా వాక్యానికి నిదర్శన మైన జీవితం ఆయనది. చిత్తరంజన్ భావి తరాల వారికి చిరస్మరణీయుడు.

(తరువాయి 27వ పేజీలో)

గురుపూర్ణిమ సందేశం

# మనసును దైవం వైపు మరల్చండి! తరించండి!!

"న తపాంసి న తీర్థానాం
న శాస్త్రానాం జపానహి
సంసార సాగరోత్తార
సజ్జనం శరణం వినా."

ప్రేమ స్వరూపులారా!

మానవుడు తరించే నిమిత్తమై అనేక విధములైన మార్గములయందు సాధనలు సలుపుతున్నాడు. తపస్సు వలన కలిగే ఫలితం తనకోసమేగాని పరులకు కాదు, పరమాత్మకు కాదు. జపము తన ఆనందం కోసం తాను చేస్తున్నాడు గాని పరుల నిమిత్తం కాదనే సత్యాన్ని గుర్తించాలి. మనం నిత్య జీవితం నుంచి తరించ వలెనని మనం ఏమి చేయాలి? జపము కాదు, తపము కాదు, పూజలు కాదు, యజ్ఞములు కాదు, యాగములు కాదు. తోటి మానవుల సేవలు చేయాలి. సేవలే ప్రధానమైన పూజ. సేవలే ప్రధానమైన తపస్సు. సేవలే ప్రధానమైన జపము. ధనమును కోల్పోయినచో తిరిగి సంపాదించుకో వచ్చును. మిత్రుని కోల్పోయినచో తిరిగి మిత్రుని సంపాదించుకోవచ్చును. పత్నిని కోల్పోయినచో తిరిగి రెండవ వివాహమాడి పత్నిని సంపాదించుకోవచ్చును. దేహమును కోల్పోయినచో తిరిగి ఆ దేహమును సంపాదించుకోలేము. కనుక దేహము చాలా పవిత్రమైనటువంటిది. ఈ పవిత్రమైన దేహమును మనం దేని నిమిత్తమై కాపాడుకోవాలి?

**"శరీరమాద్యం ఖలు ధర్మ సాధకమ్" ధర్మాచరణ నిమిత్తమై, సేవాచరణ నిమిత్తమై ఈ దేహమును మనం కాపాడుకోవాలి. మానవజన్మ చాలా దుర్లభమైనటు వంటిది, చాలా పవిత్రమైనటువంటిది, సచ్ఛీలమైనటు వంటిది. అయితే ఇట్టి మానవత్వ రహస్యాన్ని మనం గుర్తించు కోలేకపోయినప్పుడు, మానవత్వాన్ని మనం ధరించి ప్రయోజనం ఏమిటి?**

మానవునికి ఆలోచన సహజం. అన్వేషణ అత్యద్భుతం. అన్వేషణ ద్వారానే అత్యద్భుతమైన కళలు ఉద్భవిస్తున్నాయి. అయితే మానవులు ఒక్కొక్కరు ఒక్కొక్క విధమైన మార్గములో సత్యాన్వేషణ జరుపు చున్నారు. ఒకడు ఒక వృక్షములోని కనిపించేటటు వంటి శాఖల (కొమ్మలు)ను మాత్రమే చూస్తున్నాడు గాని, కనిపించనటువంటి వేళ్లను చూడటం లేదు. మరొకరు వేళ్ళను మాత్రమే చూస్తారు గాని కొమ్మలను చూడలేరు. శాఖలను చూచువారు సైంటిస్టులు. వేళ్ళను చూచువారు వేదాంతులు. అయితే ఇది సంపూర్ణమైన సత్యాన్వేషణ కాదు. సత్యాన్వేషణ అనగా శాఖలను, వేళ్ళను, ఆ చెట్టు యొక్క సంపూర్ణమైనటువంటి స్థితిని గుర్తించటం.

## భగవాన్ సాయి దివ్యబోధ

ఒక్క చిన్న ఉదాహరణ. దేవతలు, రాక్షసులు, ఇరువురు కలిసి పాల సముద్రమును మధనం చేయగా హాలాహలం ఆవిర్భవించింది. అంతటితో వారు నిరుత్సాహ పడక తిరిగి మధనం చేస్తూ రాగా అప్పుడు అమృతము, ఐరావతము ఇత్యాది పవిత్రమైన సంపదలు అంతా వారికి లభ్యమైనాయి. దేనివలన లభ్యమైంది? సంభవించిన అడ్డంకులకు ఏమాత్రం జంకక, క్రుంగక, తమ సాధనలను సక్రమంగా జరపటం చేతనే వారు విజయాన్ని సాధిస్తూ వచ్చారు.

మానవుని యొక్క హృదయమే క్షీరసాగరము. **ఈ పాల సముద్రములో జ్ఞానము అనేటటువంటి కవ్వమును వేసి మధనము సలపగా కొంత నిరాశ నిస్పృహ మనలో ఆవిర్భవిస్తుంది. దీనిని లెక్క చేయక తిరిగి మధనం చేస్తూ వచ్చినప్పుడు ధర్మం, జ్ఞానం, సత్యము మొదలగు పవిత్ర గుణములు మనకు ప్రాప్తిస్తుంటాయి. సహనం, సానుభూతి, ప్రేమ, దయ, కరుణలు కూడను**

ఇందులో ఆవిర్భవిస్తుంటాయి. కనుక మానవుడు దయ, ప్రేమ, కరుణ, సహనం, న్యాయము, ధర్మములతో జీవించడానికి ప్రయత్నం చేయాలి. ఇటువంటి సత్యాన్వేషణకు మనం అవకాశం యివ్వటంలేదు. లౌకికమైన, ప్రాకృతమైన, పవిత్రము కానటువంటి, అస్థిరమైన వస్తువుల పైన మనం సత్యాన్వేషణ సలుపుతున్నాము. నిత్య సత్యమైన వాటికోసం సత్యాన్వేషణ సలపాలి. ఈ సత్యాన్వేషణలో మనం దైవత్వాన్ని గుర్తించుకోలేక పోయినప్పటికినీ దైవత్వాన్ని గుర్తింపజేసేటటువంటి కొన్ని చిహ్నములు మనకు ఆవిర్భవిస్తాయి. ఏవిధంగా? ఉదాహరణకు ఆ వృక్షముపైన వున్నటువంటి నక్షత్రమే 'ధృవనక్షత్రము' అని చెబుతుంటాం. కాని చెట్టు కొమ్మకు, ధృవనక్షత్రమునకు ఎట్టి సంబంధం లేదు. కాని ఆ చెట్టు కొమ్మ, నక్షత్రము యొక్క ఉనికిని మనకు బోధిస్తున్నది. అదే విధముగనే మనం చేసేటటువంటి సర్వకర్మలూ, మనం పలికేటటువంటి ప్రతి పలుకూ, నడిచేటటువంటి ప్రతి నడక, చూచేటటువంటి ప్రతి చూపు - అన్నీ కూడనూ సత్యాన్వేషణలోని భాగములే. ఇవన్ని కూడనూ భగవంతుని యొక్క ఉనికికి ప్రత్యక్ష ప్రమాణములే. సముద్రాన్ని చూస్తాం, ఆ అలలను చూచి ఆనందిస్తాం. ఎత్తైన పర్వతాన్ని చూస్తాం, మనకు ఎంతో ఉత్సాహం కలుగుతుంది. దట్టమైన అరణ్యాన్ని చూస్తాం, ఆ పచ్చ దనాన్ని చూచి మన హృదయం ఉప్పొంగుతుంది. ఇవన్నీ కూడనూ సత్యాన్వేషణలోని ఉనికికి ప్రత్యక్ష సాక్షులే. ఇవి భగవంతుని చూపకపోయినప్పటికినీ, భగవంతుని శక్తి సామర్థ్యములను, ఈ విధమైన దృశ్యములచేత మనకు గుర్తింపచేస్తుంటాయి. ఒక చిన్న విత్తనము నుండి ఒక బ్రహ్మాండమైన వృక్షము ఆవిర్భవిస్తుంది. ఒక చిన్న గ్రుడ్డు నుండి ఒక పిట్ట పుడుతుంది. ఒక ప్రాణి నుంచి మరొక ప్రాణి వస్తుంది. ఒక పుష్పము నుంచి మంచి సుగంధం వస్తుంది. పాల నుంచి వెన్న వస్తుంది. ఇవన్నీ సత్యాన్వేషణ సారములే.

ఈ ప్రపంచమంతయునూ మూడు విధములైన కర్మల చేత నడుస్తున్నది. 1. సృష్టియొక్క నిర్మాణం, 2. సృష్టి యొక్క పోషణ, 3. సృష్టి యొక్క నిర్యాణం. ఈ సృష్టి స్థితి లయలు మనకు ప్రత్యక్ష ప్రమాణములు. నిత్య జీవితంలో నిత్యమూ మనం చూచేటటువంటి దృశ్యములే. ఇవన్నీ కూడనూ సత్య స్వరూపుని యొక్క ఉనికికి ప్రత్యక్ష ప్రమాణములే. ఈ సత్యమును గుర్తించడానికి తగిన కృషి చేయకుండా, దైవం ఎక్కడ? దైవం ఎక్కడ? అంటూ విమర్శిస్తున్నాం. దైవమును విమర్శించడం చాలా సులభం. కాని దైవాన్ని అన్వేషించడం మాత్రం చాలా కష్టం.

భగవంతుడు సత్యంలో సత్యంగా ఉంటున్నాడు. అసత్యంలో సత్యంగా ఉంటున్నాడు. చెడ్డలో చెడ్డగా ఉంటున్నాడు. పుణ్యంలో పుణ్యంగా ఉన్నాడు, పాపంలో పాపంగా ఉన్నాడు. దీనిని పురస్కరించుకొనియే గీతా ప్రమాణము "రసో వైసః" అన్నది. అనగా రస స్వరూపుడనై ఉన్నానని అర్థం. అనగా పానకంలోని పంచదారవలె ఉంటున్నాడు భగవంతుడు. పంచదారలేని పానకం ఉండదు గదా! అదే విధముగనే ప్రతి విషయము నందునూ భగవంతుడు అంతర్యామితుడై ఉంటున్నాడు. పాలలో వెన్న వలె ఉంటున్నాడు. పుష్పములో వాసనవలె ఉంటున్నాడు. సర్వత్రా ఉంటున్నాడు. ఇదియే 'రసోవైసః' ప్రపంచమంతా రసస్వరూపమే. కనుక పానకంలో పంచదార వంటి వాడు భగవంతుడు. ఇది చూస్తే తెలిసే

టటువంటిది కాదు. అనుభవించినప్పుడే దాని రుచి మనకు అర్థమవుతుంది. ఈ సృష్టిస్థితి లయలు మూడు కూడనూ తనయొక్క కర్మల ద్వారానే జరుగుతూ ఉంటున్నాయి. ఇట్టి మూడు శక్తులకు అధికారి అయినటు వంటివాడు 'భగవంతుడు' అని వేదములు బోధిస్తున్నాయి. ఈ మూడూలేనటువంటి ప్రదేశము లేదు. ఏ దేశం వారైనా, ఏ కాలం వారైనా, ఎవరైనా దీనిని అంగీకరించక తప్పదు. ఇంగ్లీషులో దీనిని God అన్నారు. 'G' అనగా Generation. 'O' అనగా Organisation. 'D' అనగా Destruction. ఈ మూడింటి యొక్క అర్థమే సృష్టి స్థితి లయలు. ఈ మూడూ భగవత్ సంకల్పములే. ఈ మూడూ లేకుండా జగత్ ఉండదు. ఈ మూడు కర్మలచేతనే ఈ జగత్ నడుస్తున్నది. ఇలాంటి సత్యమును మనం అర్థం చేసుకోవాలంటే ఏ విధమైన మార్గమును అనుసరించాలి.?

సమస్త సంకల్పములూ హృదయము నుండే ఆవిర్భవిస్తున్నాయి. హృదయాన్ని మధురంగా మనం ఉంచుకున్నప్పుడు మన పలుకులు, మన చేష్టలు, మన కర్మలు -సర్వమూ మధురంగానే ఉంటాయి. మన హృదయంపవిత్రంగా, నిర్మలంగా ఉంటే మన ఆలోచనలు, కర్మలు కూడా పవిత్రంగా, ఆదర్శంగా ఉంటాయి. మన మంచి చెడ్డలు రెండూ హృదయము నుండి ఆవిర్భవించేటటువంటి ఫలితములే. చెడ్డ ఎక్కడ నుంచో రావటం లేదు. మంచి ఎక్కడ నుంచో రావటం లేదు.

**"కష్ట సుఖములు రెండును కలిసి యుండు**
**దీని విడదీయ నెవరికి వశము గాదు**
**సుఖము ప్రత్యేకముగ నెందు చూడరాదు**
**కష్టము ఫలించునేని సుఖంబటండ్రు."**

**అంతా ఒక్కటే 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' ఉన్నది ఒక్కటే అట్టి ఏకసత్యాన్ని గుర్తించడానికి మానవత్వం సులభమైన మార్గమును బోధిస్తున్నది. "జంతూనాం నరజన్మ దుర్లభం " ఏమిటి ఈ దుర్లభం? "మదాత్మా సర్వ భూతాత్మ " ఇదే సరియైన ఆదర్శం. నా ఆత్మ మరియు సర్వుల యందు వుండినటు వంటి ఆత్మ ఒక్కటే .**

మానవ శరీరములో ఐదు కోశములు ఉంటున్నాయి. 1. అన్నమయకోశము 2. ప్రాణమయ కోశము 3. మనోమయకోశము 4. విజ్ఞానమయకోశము 5. ఆనందమయకోశము ఈ ఐదుకోశములలో విజ్ఞానము అనేది ఒక్క మానవునికి తప్ప మరో ప్రాణికి ప్రసాదించి వుండలేదు. కనుక ఇట్టి విజ్ఞానంతో, ప్రజ్ఞానంతో కూడినటువంటి మానవత్వాన్ని అల్పత్వంగా ఏ విధంగానూ భావించరాదు. కాదు...కాదు... మానవత్వాన్ని చాలా అల్పంగా భావించుకొని దానిని సరియైన మార్గంలో మనం ఉపయోగించుకొనకుండా మన జీవితాన్ని వ్యర్థం గావించు కొంటున్నాము. సకల సద్గుణ సంపన్నుడైన మానవుడు, సకల సదాచారములతో కూడిన మానవుడు, సచ్ఛీల సంపన్నుడైన మానవుడిని -ఏవిధంగా అల్పుడని భావించడానికి వీలవుతుంది ?తన తత్త్వమును తాను గుర్తించుకొనలేక, కేవలం తన దేహబలహీనతను మాత్రమే గుర్తించుకొని, అన్నమయకోశమును మాత్రమే ఆధారము చేసుకొని బ్రతుకుతున్నాడు. కనుక మనకు అన్నమయ కోశము కాదు ప్రధానమైనది. ఈ అన్నమయకోశమును ఆధారము చేసుకున్నంత కాలము కూడనూ మనకు అశాంతియే కాని, శాంతి మనకు లభ్యం కాదు. 64విద్యలు నేర్చిన నారదుడే శాంతి అనేది లభించక అనేక అవస్థలకు గురి అవుతూ వచ్చాడు. సనత్కుమారుని వద్దకు వెళ్లి అజ్ఞానమును దూరం చేసి శాంతిని ప్రసాదించే విద్యను బోధించమని ప్రార్థించాడు. అప్పుడు ప్రాకృతమైన , భౌతికమైన, అనిత్యమైన ఈ విద్యల వలన శాంతి లభించదని చెప్పాడు. సైంటిస్టులు కూడా ఇదే చెప్పారు Where the science ends, Spirituality begins (ఎక్కడ సైన్సు అంత్యమవుతుందో, అక్కడ ఆధ్యాత్మికం ప్రారంభ మవుతుంది.) ఈ ప్రాకృతమైన చర్యలన్నీ సైన్సుకు సంబంధించినవే. అయితే ఇవి ఈ భౌతికమైన దేహము నకు అవసరమే. భౌతికమైన దేహమును కాపాడు కొనవలసిందే. అయితే ఇదే సత్యమని, నిత్యమని భావించి, దానికే సర్వమునూ అర్పితం గావించకూడదు. సమస్త కర్మలనూ సాధించగలిగేది ఈ దేహమే. దేహము చేతనే దైవాన్ని కూడా సాధించవచ్చును. ఈ దేహము నేను కాదు. దేహము దైవాన్ని సాధించే పనిముట్టుగా భావించాలి.

ఇది నా దేహము, ఇది నా ఇంద్రియం, ఇది నా అంతఃకరణ, ఇది నా బుద్ధి. అయితే నీవెవరు? ఈ ప్రశ్న ఎవరూ వేసుకోవటం లేదు. ఇది నా చేతి రుమాల అంటే, చేతి రుమాల వేరు, నేను వేరు. అదే విధముగనే 'నా దేహము' అంటే దేహము వేరు, నేను వేరు. అయితే నీవెవరు? ఈ సత్యమును గుర్తించడానికి వెనుకంజ వేస్తూ చూచేటటువంటి దృశ్యములను మాత్రమే సత్యముగా భావించుకొని విశ్వసిస్తున్నారు. ఈ దేహము సత్యమును నిరూపించేటటువంటి పనిముట్టు. అయితే ఈ దేహము నందు దివ్యత్వమైనటువంటి పరమాత్మ తత్త్వము యిమిడి ఉంటున్నది. ఇవన్నీ పదార్థములే, ఇవన్నీ నెగిటివ్‌లే. నీవు మాత్రం పాజిటివ్. కనుక ఇదంతా పాజిటివ్‌గానే భావించుకొని నీవు అనుభవించాలి. నెగిటివ్‌ను మనసు లోనికి రాకుండా చూచుకోవాలి. ఈ నెగిటివ్‌లు నెగిటివ్‌లనే అందిస్తాయి. ఈనాడు ప్రపంచంలో అశాంతికి మూల కారణం నెగిటివ్‌ల పైన ఆధారపడి ఉండటమే. ఇదంతా Matter. నీవు Master. కనుక Master the mind, Be a Master. నీవు Master గా తయారు కావాలి. అదే నిజమైన విద్య. అంతేగాని Bookish Knowledge (పుస్తక జ్ఞానం) విద్యకాదు.

సాధించవలసింది ఎంతయో ఉన్నది. ఈ అన్నింటి కన్నా ప్రేమ, త్యాగమే చాలా ప్రధానమైనటు వంటిది. ఎక్కడ స్వార్థ రహితమైన ప్రేమ, ఎక్కడ స్వార్థ రహితమైనటువంటి త్యాగము ఉంటుందో అక్కడనే భగవంతుడు ఉంటాడు. అసలు మానవుడు భగవత్ స్వరూపుడే. మానవుని యందు ఇట్టి పవిత్రమైన గుణములు ఉంటున్నాయి. అయితే ఆ గుణములను సరియైన రీతిలో పెట్టడానికి ప్రయత్నించడం లేదు. ప్రతి మానవుని యందు దైవత్వం ఉంటున్నది. అట్టి దివ్యత్వమును గుర్తించుకొనలేక కేవలం దేహమునకు, ప్రాణమునకు, మనసుకు సంబంధించిన వ్యవహారములలో పడి, విలువైనటువంటి జీవితాన్ని వ్యర్థం గావించుకుంటున్నారు.

డైమండ్‌కు విలువ యిస్తున్నారు. బంగారము నకు విలువ ఇస్తున్నారు. ఈ విలువ యిచ్చేది ఎవరు? మనిషే. మనిషే లేకపోతే వీటికి విలువే లేదు. కనుకనే Men are more valuable than all the wealth of the world అన్నారు. మానవుడు ఈ ప్రపంచంలో ఉన్న అన్ని పదార్థముల కన్నా విలువైనటువంటివాడు. సౌజన్యము, సౌశీల్యము మానవుని ప్రధానమైన గుణములు. ప్రేమయే ఇతని ప్రాణం. ప్రేమయే లేకపోతే మానవులే లేరు. కనుకనే Love is God, Live in Love అన్నారు. ఆ ప్రేమ తత్త్వమును మనం ఈనాడు అభివృద్ధి పరచుకోవాలి. ఈ విశాల ప్రపంచమునందు మన ప్రేమ విశాలంగా ఉండాలి. ఈ విశాలమైన ప్రపంచము నందు సంకుచితమైన ప్రేమను కలిగివుంటే, ఇది సరియైన మానవత్వం కాదు. కనుక అంతా విశాలమై పోవాలి. అప్పుడే నిజమైన మానవత్వాన్ని మనం గుర్తించడానికి వీలవుతుంది.

ఈ దేహమునకు, ఈ మనసుకు ఎన్నో కష్టములు, నష్టములు సంభవిస్తుంటాయి. ఇవన్నీ కదిలి పోయే మేఘముల వంటివే గాని శాశ్వతమైనటువంటివి కావు. అవి వస్తుంటాయి, పోతుంటాయి. కాని మన గుణములు మాత్రం చాలా ప్రధానమైనటువంటివి. ఆ విలువల (Values) ను మనం పోషించుకోవాలి. ప్రతి దేశమునకు ఒకవిధమైన ఆశయాలు, ఆదర్శములు ఉంటుంటాయి, కొన్ని సామూహికమైన ధర్మములు కూడా ఉంటుంటాయి. ఈ ధర్మములను, పద్ధతులను మనం

ఏనాడు వదలుతున్నామో, ఆనాడే మనం అధోగతిపాలై పోతున్నాము.

భారతీయ సంస్కృతి చాలా పవిత్రమైనటువంటిది. ఎన్నివేల సంవత్సరములైనప్పటికినీ, ఇది కదలక, మెదలక శాశ్వతంగా నిలిచిఉంటున్నది. అనేకదేశముల సంస్కృతులు ఏనాడో కాలగర్భంలో కలిసిపోయినప్పటికి, మన ఒక్క భారతదేశ సంస్కృతి మాత్రమే నేటికి శాశ్వతంగా నిలిచి ఉన్నది. కారణమేమిటి ? దీని వేళ్ళు పాతాళమునకు దిగిపోయినాయి. దివ్యత్వమైన జలం ఈ వేళ్ళ ద్వారా సరఫరా అయి ఈ భారతీయ సంస్కృతి అనే మహావృక్షము పోషించబడుతున్నది. భారతీయ సంస్కృతి శాశ్వతమైనది. ఏదిమారినా ఇది మారదు. ఇలాంటి దానిని మనం సరిగా గుర్తించుకోలేకపోతున్నాం. ఈనాడు విజ్ఞానం మితిమీరిపోతున్నది. కావల్సినంత సుఖమును అందిస్తున్నది. కాని సుఖం ఉండి ప్రయోజనం ఏమిటి ? శాంతి లేకుండా పోతున్నది. శాంతిలేని సుఖం అది ఒక సుఖమా ? మానవునికి శాంతి ముఖ్యం, సుఖం కాదు.

ఒక పర్యాయం చర్చిల్ చెప్పాడు, "Man has conquered all but he has not conquered himself అన్నాడు. మానవుడు అన్నింటిని సాధిస్తున్నాడు, అన్నింటిని అనుభవిస్తున్నాడు. తనను తాను సాధించుకోలేనటువంటి వాడు, ఎన్ని సాధించి ఏం ప్రయోజనం ? ఇదేవిధంగా ఆనాటి బాలుడు ప్రహ్లాదుడు కూడా చెప్పాడు. "నాయనా! పంచభూతములను హస్తగతం గావించుకొని ఆడుకుంటున్నావు. కాని నిన్ను నీవు జయించుకోలేక పోతున్నావు. ప్రపంచాన్నంతా సాధిస్తున్నావుగాని, నిన్ను నీవు సాధించుకోలేనటువంటి వాడవు ప్రపంచాన్ని సాధించి ప్రయోజనం ఏమిటి ? అన్నింటిని సాధిస్తున్నావు. కానీ ఇంద్రియాలను నీవు అదుపులో పెట్టుకోలేకపోతున్నావు. నీ మనసును నీవు స్వాధీనంలో పెట్టుకోలేకపోతున్నావు. అది లేనప్పుడు ఎన్ని సాధించి ఏం ప్రయోజనం ?" అన్నాడు. కనుక మొట్టమొదట మనసును స్వాధీనం చేసుకోవాలి. ఇది ఒక్క ఆధ్యాత్మిక మార్గంలో తప్ప అన్యమార్గంలో ఇది స్వాధీనంకాదు.

కోయిల నలుపు చూసి అసహ్యించుకోకు, హాయి గొలిపే రాగాలు విని ఆనందించు. పంకం దానిలోని పరిమళాన్ని ఆఘ్రాణించు. మాటలు విని మనిషిని గౌరవించకు. మనసును కని మంచిని ఆరాధించు. మంచి చెయ్యమని చెప్పటం మానుకో. కొంచెమైనా ఆచరించి చూపించు.

**- బొగ్గరపు రాధాకృష్ణమూర్తి**

ఈనాడు గురుపూర్ణిమ. కొన్ని విద్యలు నేర్పేవాడిని ఈనాడు మనం 'గురువు' గా భావిస్తున్నాం. ఈనాటి వారు గురువులు కాదు. అధ్యాపకులు మాత్రమే. కాని గురువు ఒక్కడే. అతనే దైవము. ఈ గురుపూర్ణిమ రోజున అనేకమంది గురువులు, గురుపూజలు, గురు దక్షిణలు ప్రారంభిస్తున్నారు. 'గు' కారో గుణాతీతః, 'రు' కారో రూపవర్జితః, రూపవర్జితుడు, గుణాతీతుడు, భగవంతుడు ఒక్కడే. 'గు' అనగా అజ్ఞానం. 'రు' అనగా దాని నిర్మూలనం. అనగా అజ్ఞానమును నిర్మూలనం గావించే వాడే 'గురువు' ఈనాడు గురువులలో ఆశలు పెరుగుతునే ఉన్నాయిగాని అజ్ఞానం పోవటంలేదు. ఈనాడు మానవులను పెడమార్గమును పట్టించే గురువులు పెరిగిపోతున్నారు. ప్రాపంచిక సంబంధమైన విద్యలు నేర్పే గురువులు అనేకమంది ఉంటున్నారు. నైతిక, భౌతిక, ధార్మిక అన్ని మార్గములలో గురువులు ఉంటున్నారు. ఈనాడు కలియుగంలో "ఆధ్యాత్మికం" కూడా ఒక వ్యాపారంగా తయారైంది. ఏనాడు ఈ ఆధ్యాత్మికం వ్యాపారంలో పడిపోయిందో! ఇది ఆధ్యాత్మికమేకాదు. ఆధ్యాత్మికంలో ఏమాత్రం వ్యాపారం ఉండకూడదు. లౌకిక ప్రేమకు, ఆధ్యాత్మిక ప్రేమకు మధ్యనున్న వ్యత్యాసమును గుర్తించాలి. ప్రాపంచిక ప్రేమ కేవలం పుచ్చుకోవటానికి సిద్ధంగా ఉంటుంది. కాని ఆధ్యాత్మిక ప్రేమ (దైవ ప్రేమ) ఇచ్చుకోవటానికి సిద్ధంగా ఉంటుంది.

ప్రాకృతమైన మార్గంలో ప్రవేశించి, అన్ని విధాలా మన జీవితాలను వ్యర్థం గావించుకుంటున్నాం. ఇది కేవలం

## ఉపాధ్యాయకాద !

" గత జీవుడగు పతిన్ బ్రతికించు కొన్నట్టి
సావిత్రి భారత సతియె కాదే
తన సత్యమహిమచే దాహాన్ని చల్లార్చె
చంద్రమతి పవిత్ర పడతి కాదే
కుల సతీత్వమునకై గుండాన దూకిన
సీత భారత ధరాజాత కాదే
కినిసి దుర్మద కిరాతుని బూది గావించె
దమయంతి భారత రమణి కాదే

సత్యసాగర పరివేష్టి తోర్వీతలము
భారత జాతి పాతివ్రత్య ప్రవిమలంబు
భావ సంపదకిది మహా పంట భూమి
అఖిల దేశాలకిది ఉపాధ్యాయ కాదే !"

- బాబా.

ప్రవృతి మార్గమే. మనం నివృత్తి మార్గంలో ప్రవేశించాలి. లౌకికమైన కార్యములను అన్నీ చేసుకోవచ్చును. తప్పు లేదు. అయితే ఏ కర్మలు ప్రారంభించినా "సర్వ కర్మ భగవత్ ప్రీత్యర్థమ్" అనే భావంతో ప్రారంభించాలి. ఉద్యోగం చేయి! పదవులను పొందు! ఏది చేసినప్పటికిని ఇదంతా దైవ ప్రసాదంగా భావించుకోవాలి. అప్పుడే నిజమైన మానవత్వమును అనుభవించినవాడవుతాడు.

మానవుడనగా ఎవరు? సత్ప్రవర్తన, సదాలోచన, సచ్ఛీలం - ఈ మూడింటి యొక్క ఏకత్వమే నిజమైన మానవత్వం.

**ప్రేమస్వరూపులారా !**

అహంకార మమకారములే సమస్త దుర్గుణములకు మూలకారణం. ఈ రెండింటిని మనం ఏనాడు దూరం చేస్తామో అప్పుడే నీవు దైవస్వరూపుడవుతావు. మనం ప్రేమతో మాట్లాడాలి. సత్యంతో జీవించాలి. శాంతంతో బ్రతకాలి. అప్పుడే మనం దైవస్వరూపుల మవుతాం. ప్రేమకు మించిన మార్గం మరొకటిలేదు. ఈ ప్రేమవలననే దయ, సహనం, సానుభూతిలాంటి సద్గుణములు అభివృద్ధి అవుతాయి.

మీరు అనేకవిధములైన సాధనలు సలుపుతున్నారు. భగవంతుడు మీ సాధనలు ఎప్పుడూకోరడు, మీ భక్తిని కోరడు. మీ ప్రేమను మాత్రమేకోరుతుంటాడు. కొన్ని గంటలు ముందు మా సెంట్రల్ ట్రస్టుమెంబర్ కె. ఆర్. ప్రసాద్ వచ్చాడు. మాటల సందర్భములో "స్వామీ! భక్తునికి, దాసునికి వ్యత్యాసమేమిటి ?" అని అడిగాడు. అప్పుడు చెప్పాను. దాసుడనగా దేహమును ఆధారము చేసుకుని భగవంతుని యొక్క ప్రీతి కోసం పాటుపడేవాడు. ఎక్కడ ఉండినప్పటికినీ సర్వవేళలా దైవాన్ని చింతించే టటువంటివాడు. "సర్వదా సర్వకాలేషు సర్వత్రా హరిచింతనమ్"- భక్తుడు. నిరంతరంకూడనూ దైవసేవగానే భావించుకొని ఆశ్రయించినటువంటివాడు దాసుడు.

శంకరాచార్యునికి ఐదుగురు శిష్యులుండేవారు. ఒకడు చాలా పరిశుద్ధమైన హృదయం గలవాడు. మిగతా వారందరూ శాస్త్రములు, ఉపనిషత్తులు, వేదములు, బ్రహ్మ సూత్రములు తెలిసికోవటానికి వచ్చినవారు. వీరు ఈ తర్కవ్యాకరణాదులు చదువుతూ వచ్చారు. ఒకనాడు శంకరాచార్యులవారు నది గట్టు పైన కూర్చుని శిష్యులకు తర్కం బోధిస్తున్నాడు. ఒక శిష్యుడు మాత్రం గురుసేవే పరమావధిగ్గా పెట్టుకొని, తెల్లవారుఝామున లేచి గురువు వస్త్రాలను గంగకు తీసుకొని వెళ్ళి మంచిగా ఉతికి ఆరవేసి సాయంత్రం తీసుకొని రావటం ఆతని నిత్యకృత్యం. గురువుగారి శారీరక సేవలలో నిమగ్నుడైనాడు ఈ శిష్యుడు. ఒకరోజున గురువు నామాన్ని చింతిస్తూ ఆ వస్త్రములను గంగ ఒడ్డున ఉతుకుతున్నాడు. గంగ పొంగి పోతున్నది. అతను గమనించలేదు. గురువుగారికి వస్త్రాలను అందజేయటమే అతని లక్ష్యము. నది బాగా పొంగింది. అతను మునిగిపోయే స్థితి ఏర్పడింది. అయినప్పటికి గురువుగారి వస్త్రములను తలపైన పెట్టుకొని గురునామాన్ని చింతిస్తూ ఒడ్డుకు నడవసాగాడు. ఆ పవిత్రమైన భావమే అతను అడుగుపెట్టిన చోటంతా ఒక రాతి పద్మముగా తయారైంది. అతని పేరే పద్మపాదుడు.

శంకరులవారు అతనిని పిలిపించి ఆశీర్వదించాడు. "నాయనా! గురుసేవ చాలాగొప్పది. గురువునే దైవంగా భావించుకొన్నావు. దైవం వేరుకాదు.

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః

దైవం ఒక్కడే నిజమైన గురువు. సృష్టి స్థితిలయములు అంతా దైవమే. కనుక దైవాన్ని నీవు గురువుగా తీసుకో. వ్యక్తిని నీవు గురువుగా తీసుకోవద్దు.' అని బోధించి పద్మపాదుని ఆశీర్వదించాడు. అంతకు పూర్వం మిగిలిన నలుగురు శిష్యులు ఈ పద్మపాదుని ఎగతాళి చేసేవారు. అప్పుడు ఆ శిష్యులు నేర్చిన విద్యలన్నీ ఒకే పర్యాయం కంఠస్తంగా చెప్పాడు పద్మపాదుడు. చదివిన శిష్యులకంటే మిన్నగా చెప్పాడు.

శంకరుల వారు సహితం ఆశ్చర్యపోయి "నాయనా! ఇవన్నీ ఎలా తెలుసుకున్నావ్?" అని ప్రశ్నించాడు. "శంకరుల వారికి సర్వమునూ అర్పితం గావించుకున్నాను" అన్నాడు. 'శంకరుడు' అనగా ఎవరు? శంక లేనివాడే శంకరుడు. అలాంటి శంకరుని నేను ఆశ్రయించానన్నాడు. దైవంపైన ఏవిధమైన శంక (అనుమానం) పెట్టుకోకూడదు. అనుమానం వుంటే ఏమీ సాధించలేవు. పూర్ణవిశ్వాసం చేత, పూర్ణ ప్రేమ చేత ఏ పని ప్రారంభించినా అన్నీ సఫలమై పోతాయి. అంతా విజయాన్ని సాధించగలవు. సంగీతం, సాహిత్యం, నృత్యం - సర్వశాస్త్రములు దైవానుగ్రహము చేత లభించేటటు వంటివే. లలిత కళలన్నీ God's Gift. ఇవన్నీ దైవానుగ్రహం చేత లభించేటటువంటివే. కనుక దైవమును ఆశ్రయించిన వారికి ఎట్టి లోపమూ రాదు. ఎట్టి బాధలూ వుండవు. దైవమునే సర్వస్వంగా భావించు కొనినటువంటివాడు సర్వమూ తానుగా మారిపోతాడు. కనుక మనసును దైవము వైపు మరల్చండి! తరించండి!

(ది 9-7-1998 ప్రశాంతినిలయంలో గురు పూర్ణిమ సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య సందేశము నుండి) ●

ఎందరో మహానుభావులు-12

# మాస్టర్ సి.వి.వి

'కంచుపాటి వెంకట్రావు వెంకాసామీరావు'-అంటే చాలామందికి తెలియదు. కాని మాస్టర్ 'సి.వి.వి.' అంటే ఎరగని వారుండరు. తమిళనాడులోని కుంభకోణంలో నివాసం ఏర్పరచుకొన్న తెలుగు కుటుంబాలలో ఒక దానిలో 1868 ఆగస్టు 4న జన్మించిన సి.వి.వి. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, తమిళ భాషలలో పండితుడు. ఒకసారి ఆయన కావేరీ నదీ తీరంలో వెళుతున్నాడు. అప్పుడాయనకు మాయతెర తొలగిన అనుభూతి కలిగింది. వెంటనే ఆయనలో స్పందన మొదలైంది. నిద్రాణంగా ఉన్న ప్రజ్ఞ మేల్కొన్నది. సత్యావిష్కరణ జరిగింది. అంతట ఆయన 1910 మే29న 'భృక్త రహిత తారక రాజయోగం' అనే విశిష్ట రాజయోగ మార్గాన్ని ఆవిష్కరించారు. అప్పటి నుండి వెంకాసామీరావు 'మాస్టర్ సి.వి.వి' గ సుప్రసిద్ధు లయ్యారు.

1910లోనే కుంభకోణంలో "యోగాస్కూల్ ఫ్రండ్స్ సొసైటీ"ని ఆయన నెలకొల్పారు. మాస్టర్ ప్రబోధించిన యోగలక్ష్యం వ్యక్తికి అమరత్వాన్ని కలిగించటం. శారీరక రుగ్మతలను తాను తొలగించుకొని ఇతరుల సుస్తీలను కూడా తొలగించ గలగటం ఆ యోగా మార్గాన్ని అవలంబించటంవల్ల కలిగే మొదటి ఫలం. అంతిమ ఫలం అమరత్వ సిద్ధి.

మాస్టర్ సి.వి.వి బోధించిన యోగసాధనల వలన 'కుండలినీ శక్తి మేల్కొంటుంది' అని చెప్పబడుతోంది. అందువల్ల సంతత ధారగా ప్రాణశక్తి సాధకునికి లభించి,శాశ్వతత్వాన్ని, పూర్ణత్వాన్ని పొందుతాడు.

ఈ యోగమార్గాన్ని అవలంబించి ప్రచారం చేసిన ప్రముఖులలో మైనంపాటి నరసింహంగారు( ఒంగోలు న్యాయవాది), వేటూరి ప్రభాకరశాస్త్రిగారు( సుప్రసిద్ధ పరిశోధకులు, రచయిత), ఉన్నవ లక్ష్మీనారాయణ (స్వాతంత్ర్య సమరయోధులు, సంఘసేవకులు, 'మాలపల్లి' నవలా రచయిత), ఎక్కిరాల కృష్ణమాచార్యులు ('డివైన్ లైట్ సొసైటీ' స్థాపకులు) ఉన్నారు.

-భండారు పర్వతాలరావు

# కుటుంబ వ్యవస్థ నాడు - నేడు

"మాంగల్యం తంతునానేన మమజీవన హేతునా
కంఠే బధ్నామి శుభగే సా.జీవ శరదాం శతమ్"

అమ్మాయి పెండ్లి అత్యంత వైభవంగా జరుగుతున్నది. నూతన వధూవరులు పెండ్లి రోజున ప్రమాణాలు చేస్తున్నారు. "ధర్మేచ, అర్థేచ, కామేచ, నాతిచరామి". అయిపోయింది. అనుకున్న ప్రకారం అన్నీ సక్రమంగా జరిగినాయి. అబ్బాయి గుణగణాలు, అత్తవారింటి సత్ సంప్రదాయ పద్ధతులు, కుటుంబగౌరవం అన్నీచూసి అమ్మాయి పెండ్లిచేసి, అత్తవారిఇంటికి పంపించారు. 'అత్తమామల మాట అడుగుదాటకుమా! పతిని దైవమ్ముగా మదిలోనదలచి! మతిమంతురాలవై మనుము మాయమ్మా' అని ఆనాటి తల్లులు పిల్లలకు చెప్పిపంపించేవారు. అమ్మాయి కూడా అలాగే నడుచుకునేది. అమ్మానాన్నల చాటున ఏమీ తెలియని ముగ్ధలా, సుకుమారంగా, ఆడుతూ పాడుతూ తిరిగిన పిల్ల ఇప్పుడు ఒకరికి ఇల్లాలు అయింది. కోటి కోర్కెలతో, మధురమైన ఊహల్లో తేలిపోతూ అత్తవారింట్లోకి అడుగుపెట్టింది. ఆమెకు అన్ని విధాలా రక్షణను, సమాజంలో ఒక గౌరవమైన స్థానాన్ని కల్పించాడు భర్త. ఇది వరకు సమిష్టి కుటుంబాలే ఎక్కువ. కుటుంబ సభ్యులందరికి తలలో నాలుకలాగా మెలగవలసి వచ్చేది. రామాయణ భారతాలు చదవటం, ఇంటి వ్యవహారములను చక్కదిద్దుకునే పాటి చదువు చాలనుకొనే వారు ఆనాటివారు. అది ఆనాటి వ్యవస్థ.

ఇక ఈనాడు ! ఆడపిల్లలు కూడా పెద్ద పెద్ద చదువులు చదువుతున్నారు. ఉన్నతమైన విద్యనేకాక, అత్యున్నతమైన పదవులను కూడా సమర్ధవంతంగా నిర్వహించుకుంటున్నారు. భర్తతో సమానంగా సంపాదిస్తున్నారు. ఆర్థికంగా సమర్ధులవటం వలన వారి మనోభావాలుకూడా స్వతంత్రంగానే ఉంటున్నాయి. వారికంటూ ఒక ప్రత్యేకమయిన వ్యక్తిత్వాన్ని ఏర్పరుచుకుంటున్నారు. ఇది హర్షించదగిన విషయమే. కానీ విజ్ఞానం పెరిగినకొద్దీ, కొందరిలో తర్కవాదం, హేతువాదం కూడా పెరుగుతున్నది. మన శాస్త్రాలూ, పురాణాలూ ఇప్పటివారికి చాదస్తంగా కనిపిస్తున్నాయి. ఇది మంచిది కాదు. ప్రతివారూ చదువుకోవలసినదే. అందులోనూ ముఖ్యంగా స్త్రీలు తప్పనిసరిగా విద్యావంతులుకావాలి. ఒక పురుషుడు విద్యావంతుడు అయ్యేదానికన్నా, ఒక స్త్రీ విద్యావంతురాలైతే ఆ కుటుంబానికి ఎక్కువ మేలు జరుగుతుంది. అయితే ఈనాడు విద్యనభ్యసించటం ఉద్యోగం కోసమని, ధనసంపాదనకేనని అభిప్రాయం చాలామందిలో ఉన్నది. ఈనాటి విద్యలు కేవలం పొట్టకూటి కోసమేనని

సాయి ప్రియ

అభిప్రాయం నానాటికి ప్రబలిపోతున్నది. అంతేకాదు సమాజంలో తన ఆధిక్యతను నిరూపించుకోవాలనే కోరికతో ఉన్నత విద్యలనభ్యసిస్తున్నారు మరి కొంతమంది. ఇది నిజంగా దురదృష్టకరం. విద్య ద్వారా వినయశోభితులు కావాలి. సంస్కారంలేని చదువు, వినయంలేని విద్య, వివేకంలేని విజ్ఞానం ఈనాడు పెరిగిపోవటం వలన, సరియైన అవగాహన లోపించి స్త్రీలు విద్యాధికులైన కొన్ని కుటుంబాలలో కలతలు ఏర్పడి సుఖశాంతులు కరువైపోతున్నాయి. విద్యాధికులైన స్త్రీలు కొంతమంది ఉద్యోగాల మీద చూపుతున్న ఆసక్తి తమ కన్నపిల్లల చదువుల మీద చూపకపోవటం వలన వారి భవిష్యత్తు ఆశించినంత ఉజ్వలంగా కనిపించటంలేదు. కనుక విద్యావంతులైన స్త్రీల ఆలోచనాసరళి మారాలి. తాము సముపార్జించిన విద్యావిజ్ఞానములను తమ పిల్లలను సంస్కారవంతులుగా తీర్చిదిద్దటానికి వినియోగించాలి..

పరబాలురకు నేర్ప పాఠశాలల కేగ
తమ బాలురకు నేర్పు తల్లులెవరు ?

- బాబా

# రక్తమార్పిడి

ఇంగ్లీషులో ఒక సామెత ఉంది - ***"Rome was not built in one day"*** అని. అంటే రోమ్ నగరం ఒక్కరోజులో నిర్మితం కాలేదని. ఏదైనా సమగ్రమైనరూపు సంతరించుకోడానికి కాలవ్యవధి ఎక్కువ ఉంటుంది అని చెప్పడానికి ఈ సామెతను ఉదహరిస్తుంటారు. ఆదిలో ఎదురయ్యే అవరోధాలను అధిగమించి మధ్యలో వచ్చే సమస్యలకు సమాధానాలు కనుగొంటూ ముందుకు సాగినప్పుడే నిర్దుష్టమైన ప్రక్రియ రూపొందుతుంది. ఉదాహరణకు రక్తమార్పిడినే తీసుకుందాం. ఈనాడు ఓవర్‌హెడ్ టాంక్ లో నుంచి గొట్టంద్వారా గీజర్‌లోనికి నీటిని మార్చినంత సులువుగా ఒక వ్యక్తి నుంచి మరో వ్యక్తికి రక్తాన్ని మార్చడం సాధ్యమవుతోంది. దీని మూలంగా ఎందరో రోగులు ప్రాణాపాయం నుంచి బయటపడ గలుగుతున్నారు. అయితే మూడు శతాబ్దాల సుదీర్ఘకాలం ఎందరో శాస్త్రవేత్తలు తపోదీక్షతో చేసిన పరిశోధనల ఫలితమే ఈనాటి రూపం.

మూడువందల సంవత్సరాల క్రితం వైద్యులకి రక్తం గురించి అవగాహన సరిగా ఉండేది కాదు. మనుష్యుల రక్తమైనా, జంతువుల రక్తమైనా రక్తం రక్తమే. అంతా ఒక్కటే అన్న ధోరణిలో ఉండేవి వారి ఆలోచనలు. అందువల్ల తీవ్రమైన గాయాలవల్ల రక్తం బాగా పోవడం మూలంగా కాని , ఎనీమియా వంటి వ్యాధుల వల్ల రక్తహీనత ఏర్పడి ప్రాణాపాయ స్థితి సంభవించినప్పుడు కాని అట్టి వారికి జంతువుల రక్తాన్ని ఎక్కించి స్వాస్థ్యపరచ వచ్చునన్న అభిప్రాయం ఉండేది. ఇటువంటి నమ్మకం గల జీన్ బాప్టిస్ట్ డెనిస్ అనే ఫ్రెంచివైద్యుడు తొలిసారిగా 1667వ సంవత్సరం జూన్15వ తేదీన రక్తమార్పిడి ప్రయోగం చేశాడు. ఆయన ఎన్నుకొన్న రోగి తీవ్రజ్వరంతో బాధపడ్తుండిన పదిహేనేళ్ళ బాలుడు. అతని జ్వరతాప తీవ్రతను తగ్గించడానికి అప్పటికి సుమారు ఇరవైసార్లు ఆ బాలుడి దేహం నుంచి రక్తాన్ని తీసేశాడు. డెనిస్ ఒక గొర్రె పిల్లను తీసుకు వచ్చి దాని కెరటాయిడ్ ఆర్టరీ నుంచి తొమ్మిది ఔన్సుల రక్తాన్ని తీసి ఆ బాలునికి ఎక్కించాడు. అదృష్టం బాగుండి ఆ పిల్లవాడు చావుతప్పి కన్ను లొట్టపోయినట్లు ప్రాణాలతో బయటపడ్డాడు. అయితే అటువంటి ప్రయోగాలకు గురిఅయిన ఇతర పేషెంట్లలో ఒకరు చనిపోవటంతో ఫ్రాన్స్‌లో జంతువుల రక్తాన్ని మనుష్యులకు ఎక్కించడాన్ని నిషేధించారు. అయితే డెనిస్ అప్పటి ఫ్రెంచి రాజైన 14వ లూయీకి ఆస్థానవైద్యుడు కావడంతో ఏ చిక్కులోనూ చిక్కుకోకుండా బయటపడ్డాడు. ఫ్రాన్సే కాకుండా ఇతర ఐరోపా దేశాలు కూడా ఇటువంటి రక్తమార్పిడిని నిషేధించాయి.

## కె.ఆర్.కె. మోహన్

మరో 150 ఏళ్ళవరకు రక్తమార్పిడి విషయంలో ఏవిధమైన ప్రగతి రాలేదు. 1818 సెప్టెంబరులో ఇరవై ఎనిమిదేళ్ళ డాక్టర్ జేమ్స్ బ్లండెల్ అనే ఆంగ్లవైద్యుడు ఒక వినూత్న ప్రయోగం చేశాడు. ఇంజక్షనుకి వాడే సిరంజిని కనుగొన్నది ఈయనే. సిరంజిద్వారా తాజా రక్తాన్ని తీసి రోగికి ఎక్కించాడు ఈయన. కాని ఆ రోగి చనిపోవడంతో నిరాశ, నిస్పృహలకు లోనయ్యాడు బ్లండెల్. నిజానికి ఆ రోగి చనిపోయింది రక్తం ఎక్కించడం వల్ల కాదు ! అప్పటికే అతను అవసాన దశలో ఉన్నాడు. పదేళ్ళ తర్వాత బ్లండెల్ తన పద్ధతి ద్వారా మరో పేషెంట్‌ను రక్షించగలిగాడు. కానిఆ ఖ్యాతి అతనికి దక్కలేదు. కారణమేమిటంటే అంతకు మూడు సంవత్సరాలకు ముందే అంటే 1825లోనే డబల్‌డే అనే మరో బ్రిటిష్ వైద్యుడు ఈ ప్రయోగాన్ని విజయవంతంగా చేయడంతో తొలి రక్తమార్పిడి విజయపు ఖ్యాతి ఆయనకి దక్కింది. ఒక స్త్రీకి కడుపులో రక్తనాళాలు పగిలిపోయి హెమరేజ్ ఏర్పడగా ఆయన 14 ఔన్సుల రక్తాన్ని ఎక్కించి కాపాడాడు. ఆరు ఔన్సుల రక్తం

ఎక్కించే సరికే ఆమె "నాకు ఆంబోతు కున్నంత శక్తి వచ్చింది." అంటూ లేచి కూచుందట.

డబల్ డే, బ్లండేల్‌లు జరిపిన రక్త మార్పిడి ప్రయోగాలు విజయవంతమైనా రెండు ప్రధాన సమస్యలు అవరోధాలుగా నిలిచాయి. మొదటిది - వ్యక్తి దేహం. పరాయి వ్యక్తి రక్తాన్ని సులువుగా స్వీకరించకపోవడం. రక్తం అంతా ఒకటిగానే ఉంటుందన్న అభిప్రాయం కలిగిన ఆనాటి వైద్యులకి ఇలా ఎందుకు జరుగుతుందో అంతు పట్టలేదు. 1900వ సంవత్సరంలో ఆస్ట్రియాలోని వియన్నాకు చెందిన డాక్టర్ కార్ల్ లాండ్ స్టెయినర్ రక్తంలో వేర్వేరు గ్రూపులు ఉంటాయన్న విషయాన్ని కనుగొన్నప్పుడే ఇందులోని రహస్యం బయటపడింది. అప్పటినుంచి రోగిదీ, దాల్‌దీ ఒకే రక్తం అయినప్పుడే రక్తమార్పిడి చేసి విజయం సాధించసాగారు.

ఇకపోతే రెండవ ఆటంకం సంగతి. రక్తం శరీరం నుంచి బయటకు వచ్చాక గాలి తగలగానే త్వరత్వరగా గడ్డ కడ్తుంది. రక్తానికున్న ఈ లక్షణం వల్ల రక్త మార్పిడి సమయంలో ఇబ్బందులు ఎదురయ్యేవి. అయితే త్వరలోనే సోడియం సిట్రేట్ అనే రసాయనానికి రక్తం గడ్డ కట్టడాన్ని నిరోధించే లక్షణం ఉందన్న విషయాన్ని శాస్త్రజ్ఞులు కనుగొనడంతో రక్తమార్పిడి చరిత్రలో మరో మైలు రాయిగా నిలిచింది. 1916 నవంబర్ 14న ఈ రసాయనాన్ని రోగికి ఎక్కించే రక్తంలో కలిపి తొలిసారిగా అర్జెంటీనాకి చెందిన ప్రొఫెసర్ అగోటిబ్యూనస్ ఐరిస్ నగరంలో విజయ వంతంగా రక్తమార్పిడి చేశాడు. ఈ పద్ధతిని అనుసరించడం వల్ల మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతున్న ఆ కాలంలో ఎందరో క్షతగాత్రుల ప్రాణాలను రక్షించడం సాధ్యం అయింది.

అయితే వైద్యులకి మరో సమస్య ఎదురైంది. రోగులకి అవసరమైన సంఖ్యలో రక్తదాతలు లభ్యం కావడం గగనమయింది. అటువంటి పరిస్థితులలో డాక్టర్ ఆస్వల్డ్ రాబర్ట్‌సన్ అనే అమెరికన్ వైద్యునికి రక్తాన్ని గ్లూకోజ్‌తో కలిపి సీసాలలో భద్రపరచవచ్చునన్న ఆలోచన వచ్చింది. దాని ఫలితమే 1917లో పశ్చిమ ప్రాంతంలో డేలెన్స్ అనేచోట ఆయన స్థాపించిన రక్తాన్ని నిలువజేసే కేంద్రం. ఇదే క్రమేపి బ్లడ్ బ్యాంక్‌లు రూపంలో ప్రపంచమంతటా విస్తరించింది.

రక్తదాతలు లభించినప్పుడే బ్లడ్ బ్యాంకులకు సార్ధకత ఏర్పడుతుంది. 1921లో బ్రిటన్‌లో డాక్టర్ పి.యల్. ఆలివర్ ఆధ్వర్యంలో బ్రిటిష్ రెడ్ క్రాస్ సొసైటీకి చెందిన నలుగురు స్వచ్ఛంద రక్తదాతలతో లండన్‌లోని కింగ్స్ కాలేజి హాస్పటల్‌లో తొలి బ్లడ్ బ్యాంక్ ఏర్పాటయింది. ఈనాడు చిన్న చిన్న పట్టణాలలో కూడా మనకి ఈ రక్త నిధులు అంటే బ్లడ్ బ్యాంకులు దర్శనమిస్తున్నాయి.

ఈనాడు రక్తమార్పిడి ప్రక్రియ ఎంతగా అభివృద్ధి చెందిందంటే మాతృగర్భంలో వున్న శిశువుకి కూడా రక్తమార్పిడి చేసి కాపాడ గలిగే స్థితికి చేరుకుంది. 1963 సెప్టెంబర్ 20 న న్యూజిలాండ్‌లోని ఆక్లాండ్ పట్నంలోని నేషనల్ ఉమన్స్ హాస్పిటల్‌లో మిసెస్ మెక్లియాడ్ అనే ఆమె గర్భస్థ శిశువుకి తొలిసారిగా ఇటువంటి ఆపరేషన్ చేసి ప్రొఫెసర్ జార్జి గ్రీన్ ఆయన బృందం చరిత్ర సృష్టించారు. గర్భంలో వుండగానే పిండానికి ఈ రక్త మార్పిడి జరగకుండా వుండివుంటే, మృత శిశువే జన్మించి ఉండేది. ఆదిలో నత్త నడకతో ప్రారంభమైన ఈ రక్త మార్పిడి ప్రక్రియ ఈనాడు ఊహకి అందని ప్రగతితో సాగిపోతుంది. ●

# విదురనీతి

"యథా మధు సమాదత్తే
        రక్షన్ పుష్పాణి షట్ పదః
తద్వదర్ధాన్మనుష్యేభ్య
        ఆదద్యాదవి హింసయా."

తుమ్మెద పూలను రక్షించుమనే వాటి నుండి తేనెను తీసుకొనినట్లుగా, మనుష్యులను హింసింపకనే, రాజైనవాడు, వారినుండి ధనమును రాబట్టవలెను.

# భగవత్సంకీర్తనమే దివ్యౌషధం

స్వతహాగా మానవుడు అహంభావి. తానే సకల సంపన్నుడనని భ్రమిస్తాడు. స్వయంశక్తి తోనే సర్వకార్యాలు చేయగల సమర్థుడనని విర్రవీగుతాడు. భగవత్సృష్టిలో తానొక అంశ మాత్రమేనన్న సత్యాన్ని గ్రహించడు. తనకున్న శక్తి సామర్థ్యాలు పరిమితమని, తానొనరించెడి ప్రతి కార్యము వెనుక పరమాత్ముని అదృశ్యశక్తే ఆధార భూతమై ఉంటుందని గ్రహించలేని అజ్ఞానుడు. తాను సాధించిన ఘనకార్యాలేవైనా ఉంటే అందుకు తన ప్రయోజకత్వ ప్రభావమే కారణమని తలుస్తాడు. తన ప్రయత్నాలు బెడిసికొట్టినంతనే దేవునిపై నింద మోపడానికైనా వెనుకాడడు. ఇట్టి అహంభావానికి మూల కారణాలు మూడున్నాయి. ఒకటి ఉన్నత వంశోద్భవము, అపార ధనసంపద, జ్ఞానసముపార్జనతో కల్గిన మేధోశక్తి! ఈ మూడింటి ప్రభావంలోపడి, తన ప్రణాళికాబద్ధమైన ఆలోచన, ఆచరణలే ప్రతికార్యమునకు విజయసోపానాలని సగర్వంగా చెప్పుకొంటాడు. పాపం!... శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదని, ఆకైనా అల్లల్లాడదని, తెలిసికోలేని అమాయకుడు. కాని అవేమీ లేని అతి సామాన్యుడు కూడ అనితర సాధ్యమైన కార్యాలు సాధించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. వారికాశక్తి ఎక్కడినుంచి లభించింది? ... నిత్యం నీడలా వెన్నంటి వారిని సంరక్షిస్తూ, సహాయపడే శక్తి ఏది? - అని ఆలోచిస్తే దొరికే సమాధానం ఒక్కటే! అదే వారి విశ్వాసం! అదృశ్యరూపుడైన ఆ పరమాత్మునిపై వారికి గల అచంచల విశ్వాసమే! - ఆ అదృశ్య శక్తి సంస్మరణమే వారి మనోబలం. ఆ భగవత్సంకీర్తనమే వారి రక్షణ కవచము.

"భగవంతునిపై సంపూర్ణ విశ్వాసముంచు! ఆయన నీ వెనుకనే ఉండి నిన్ను అన్ని విధాల ఆదుకొని ముందుకు నడిపిస్తాడు" - అని చాటి చెప్పే సద్గ్రంథాల సారాంశమే వారి కారాధ్యము. ఈ సత్యాన్ని చాటి చెప్పే ఉదంతాలెన్నో మన పురాణగ్రంథాలలో ఉటంకించబడ్డాయి. జన్మనిచ్చిన తల్లిదండ్రులే తన రక్షకులని, వైద్యుని ఔషధమే అస్వస్థతకు నివారణని, తలపోస్తారంతా ! కాని యివి తాత్కాలికమే! ఎందుకంటే - అవన్నీ నిష్ఫలమై పోయిన సందర్భాలనేకమున్నాయి. కాని సర్వోత్తమ సర్వశక్తి మంతుడైన భగవంతుడొక్కడే సర్వ ప్రాణులకు రక్షకుడు!

బలవంతుడనని విర్రవీగుతున్న తండ్రి నెదిరించిన బాల భక్త ప్రహ్లాదుని నిర్భీకతకు కీలకమిదే ! ఏ మానవుడూ భగవంతుని కన్నా శక్తివంతుడు కాడని, ఆతడే సర్వశక్తిమంతుడని, మన స్ఫూర్తిగ నమ్మిన భక్తులను తప్పక రక్షిస్తాడని - విశ్వసించాడు ప్రహ్లాదుడు ! అందుకే- హరి ద్వేషా హృదయుడైన హిరణ్యకశిపుని ఆజ్ఞానుసారము - క్రూర రాక్షసులు ప్రహ్లాదుని మండు టెండలో నిలబెట్టి

## సోమంచి రామం

శూలములతో పొడిచినా, మద గజం చేత త్రొక్కించినా, కోడె త్రాచుల చేత కరిపించినా, సముద్రమున ముంచినా, కొండల పై నుంచి దొర్లించినా, విషాహారము తినిపించినా, కొరడాలతో కొట్టించినా, నిండు మనసుతో ఆ హరినే ధ్యానిస్తూ - ఆ శిక్షల నన్నింటినీ సంతోషంగా స్వీకరించి, ఆనందంగా అనుభవించాడు !

ఇన్నివిధములుగా హింసించినా, కించిత్తయినా జంకక, నిర్భయంగా, చిరునవ్వులు చిందిస్తున్నట్లున్న ప్రహ్లాదుని చూచి ఆగ్రహోదగ్రుడైన హిరణ్యకశిపుడు "నీకింత బలము, ధైర్యము, ఎక్కడివిరా?" అంటూ గర్జించాడు.

**'బలయుతులకు దుర్బలులకు**
**బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మా**
**దులకున్ బలమెవ్వడు ప్రాణులకును**
**బలమెవ్వండట్టి విభుడు బలమసురేంద్రా!'**

అంటూ సమాధానం చెప్పాడా బాలుడు!

ఏఏ సమయాల్లో, ఏఏ ప్రదేశాల్లో, ఏఏ వ్యక్తుల చేతిలో మృత్యువు రాకూడదో నిర్దేశిస్తూ బ్రహ్మనుంచి వరము పొందిన తన తండ్రికి నరుడు-సింహము కలిసిన నరసింహావతారంతోనే అంతిమ ఘడియలు సంప్రాప్తించేలా హరినామ సంకీర్తనతో సాధించగల్గిన ప్రహ్లాద చరితము అత్యంత పఠనీయము, శ్రవణీయము, స్మరణీయము. అందుకే సమస్త రుగ్మతలకు భగవత్సంకీర్తనమే దివ్యౌషధము.

రసవద్ఘట్టాలు-39

# మౌనయోగం-సంగీతం

సంగీతం ధ్వని యుక్తం. కాని సంగీతంలో సాధన పెరిగినకొద్దీ, అంతర్ బహిర్ ధ్వనుల మధ్య మౌనం అవతరిస్తుంది. అదే నాదయోగం. సంగీత కళా రహస్యాలను ఆకళించుకొన్న మహనీయులు వాద్య పరికరాలను విసర్జిస్తారు, ధ్యానయోగులుగా పరిణతి చెందుతారు.

లక్నో నగరం కళల నిలయం. నవాబు కళాకారులను గొప్పగా గౌరవించేవాడు. బ్రిటిష్ వారు క్రమంగా మనదేశంలోని సంస్థానాలను వశపరుచు కొంటున్న కాలం. వారు లక్నోపై దాడి చేయటానికి పూనుకొన్నారు. నగరమునకు దగ్గరగా బ్రిటిష్ సేనాపతి వచ్చినట్లు నవాబుకు వార్త అందింది. ఆ సమయంలో నవాబు సంగీత కచ్చేరీలో పాల్గొనిఆనందిస్తున్నాడు. ఆంగ్లసేనాపతి మరింత సమీపానికి వచ్చినట్లు నవాబుకు తెలిపారు. నవాబు ప్రశాంతంగా "వారిని ఆహ్వానించండి వారు మా అతిథులు"అన్నాడు. శత్రువును అతిథిగా ఆహ్వానించిన సంఘటనలు చరిత్రలో చాలా అరుదు. వారికి అన్ని సదుపాయాలు సమకూర్చండి. రేపటిదినం, నేనే వెళ్లి వారిని మన దర్బారుకు ఆహ్వానిస్తాను. వారు ఇక్కడే ఉండదలిస్తే ఉండనిద్దాం. అధికారం కావాలంటే అప్పగిస్తాను. అనవసరమైన సంఘర్షణ, హింసాకాండ వద్దు. కొందరు మూర్ఖులు లక్నోపై దాడి చేస్తారన్న అల్పకారణం వల్ల నేను సంగీత వేత్తలకే మాత్రం బాధ కలిగించను." అన్నాడు.

నవాబు దర్బారులో చాలా మంది గాయకులు సమావేశమయ్యారు. కాని నగరంలోని ఒక గాయకుడు మాత్రం హాజరుకాలేదు. అతడు ఎందుకురాలేదు అని నవాబు ప్రశ్నించాడు. "అయ్యా, అతనికి మతి భ్రమించింది. తాను సంగీత సాధనలో నున్నపుడు ఎవరూ కదలకూడదని, తల ఆడించకూడదని, అల్లా సంగీతం వింటూ తల ఆడించిన, అతని తలను ఖండించాలని చెబుతున్నాడు. ఈ షరతును ఆమోదించినపుడే తాను దర్బారుకు రాగలనంటున్నాడు.' అని నవాబుకు నివేదించారు.

ఈ సంగతి తనకుముందే తెలిపి ఉండిన అతనిని ఆహ్వానించి అతని షరతులను ఆమోదించేవాడిని. ఆ గాయకుని షరతులను పాటించేవారిని మాత్రమే సంగీత గోష్ఠికి ఆహ్వానిస్తామని, సమ్మతించని వారు గోష్ఠికి రానక్కరలేదని, నవాబు చాటించాడు.

## జానమద్ది హనుమచ్ఛాస్త్రి

సుమారు పదివేలమంది, ఆ సంగీత విద్వాంసుని గానం వినటానికి వచ్చారు. నవాబు, తనమాట తప్పని వాడు. సమావేశభవనం చుట్టూ ఖడ్గధారులైన సైనికులను నియమించాడు. సంగీతం వింటూ, ఆ తన్మయత్వంలో తల అల్లాడించిన వారి శిరసు ఖండించిన, కార్యక్రమానికి అంతరాయం కలుగునని భావించి, తల అల్లాడించిన వారి పేర్లను సేకరించునట్లు నవాబు ఆదేశించాడు.

సంగీతం కార్యక్రమం చివరన లెక్కవేసినపుడు కేవలం పండ్రెండుమంది మాత్రం తలలను ఆడించినట్లు తేలింది.

"అయ్యా, నాషరతులను నెరవేర్చారా?"అని అడిగాడు. 'ఇదిగో ఈ పన్నెండుమంది షరతులను విస్మరించారు. ఇక మీ ఇష్టం వారి తలలను తీయమంటారా?' అని అడిగాడునవాబు.

అందుకు సమాధానంగా, గాయకుడు "అయ్యా, నాసంగీతం వినటానికి ఈ పన్నెండుమంది మాత్రమే అర్హులు. తక్కిన వారినందరినీ పంపివేయండి. వారు నా సంగీతం వినటానికి రాలేదు. తమను తాము కాపాడు కోటానికి వచ్చారు. సంగీత రస ప్రవాహంలో తల

ఆడించని వారు రసహీనులు. వారికి సంగీతం అనవసరం. ఈ పన్నెండుమందికోసం ఈ రాత్రంతా పాడుతాను. తాము దయతో అవకాశం కల్పించండి' అని కోరాడు. ఇదొక విచిత్రమైన మలుపు.

'సంగీతరస పిపాసులను కనుగొనుటకు ఇది విచిత్రమైన మార్గం' అన్నాడు నవాబు.

గాయకుడు బదులు చెబుతూ, "ఈ పన్నెండు మందికి సంగీతం ప్రాణంకంటే గొప్పది. వారు తను పై విధించిన షరతులను విస్మరించారు. వారు సంగీత రసాంబుధిలో ఓలలాడసాగారు. వీరికోసం రాత్రంతా సంగీత కార్యక్రమం ఏర్పాటుచేసిన తమకు నేను సదా కృతజ్ఞుడను. తమనుండి నాకే పురస్కారం వద్దు అన్నాడు గాయకుడు. నా సంగీతాన్ని ఆస్వాదించగల వ్యక్తులను ఎన్నుకొన్న తమకు నా నమస్సులు. ఇంతకంటే గొప్ప బహుమానమేమున్నది? తాము దయచేసి ఈ పన్నెండు మందిని సముచితంగా సత్కరించమని ప్రార్థిస్తున్నాను. ఎందుకనగా. వారికి సంగీతమే సర్వస్వం. వారికి అదొక ధ్యానయోగం' అన్నాడు.

నవాబు ఎంతగానో ఆనందించాడు.

(ఓషో రజనీష్ ప్రసంగం ఆధారంగా)

## యక్ష ప్రశ్నలకు సమాధానాలు

"చతుర్వేదోఽపి దుర్వృత్తః
స శూద్రాదతి రిచ్యతే
యోఽగ్ని హోత్ర పరోదాంతః
స బ్రాహ్మణ ఇతి స్మృతః"

నాలుగే వేదాలు చదివినప్పటికీ, ఎవడు దురాచారపరుడై ఉండునో, అట్టి బ్రాహ్మణుడు శూద్రుని కన్నా హీనుడు. అగ్ని హోత్రము లందు శ్రద్ధ గలవాడు, జితేంద్రియుడూ ఐనవాడే బ్రాహ్మణుడు.

## "అన్న వారికి తన్నులు"

అమెరికాలో కార్మికులుగా భారతీయులు వుండేవారు. భారత దేశంలో పనిచేసిన ఆంగ్లేయులు ఎవరైనా అమెరికా వెళ్లినప్పుడు వేష భాషలను బట్టి భారతీయులను గుర్తుబట్టి కలకత్తా, బొంబాయి, మద్రాసు అని అరచేవారుట. అట్టివారిని మనవారు సంతోషంగా హోటల్‌కు తీసుకుని వెళ్లి విందులు చేసేవారుట. మన దేశంలో పని చేసి వెళ్లిన ఆంగ్లేయు లపై మనవారు మర్యాద పూర్వకంగా ప్రవర్తించేవారు. మన దేశం నుండి వచ్చారనే అభిమానం వారిపైన వుండేది.

అమెరికా స్వాతంత్ర్యం సంపాదించుకున్నాక ఆ ప్రభావం అక్కడ వుండే మన వారిపైబడింది. అమెరికా లోని భారతీయుల తరపున "గదర్" అనే పత్రిక వెలువరించసాగారు. ఆ ప్రభావం మనవారందరి మీద పడింది. మనని పరిపాలించే తెల్లవాళ్లని వెళ్ల గొట్టాలనే భావన మనవాళ్లల్లో చోటుచేసుకుంది.

అప్పటి నుండి ఎవరైనా తమని గుర్తుపట్టి కలకత్తా, మద్రాసు, బొంబాయి అని పలుకరిస్తే ఆ ఆంగ్లేయులను హోటలుకు తీసుకుని వెళ్లేవారుట. మద్యం పోయించి మాటల మధ్యలో తగాదా పెట్టుకుని తన్ని పంపేవారట. మరికొన్నాళ్లకి ఈ విషయం అందరికి తెలిసి మనవారిని పలుకరించడానికి అక్కడి ఆంగ్లేయులు భయపడేవారుట. ఎందుకంటే అన్నవారికి తన్నులే కదా ప్రాప్తం.

పత్రిక ప్రభావం ఎటువంటిదో చూశారా ! అమెరికాలోని భారతీయులకు స్వాతంత్ర్యం అంటే ఏమిటో తెలియజేసింది, అక్కడి భారతీయులలో చైతన్యాన్ని కలిగించింది. అక్కడి నుండి ఆవిర్భవించిన ఉద్యమాగ్నికి ఆజ్యం పోసింది. ఈ మధ్య శ్రీవాణి ప్రాంగణంలో శ్రీ జి.వి.జి.గారు తన ప్రసంగంలో పత్రికలు చాలా పవర్ ఫుల్ మీడియా అన్నారు కదా ! ఈ విషయం అక్షరాలా సత్యం అని ఎప్పుడో చరిత్ర చాటి చెప్పింది అనడానికి పై విషయం సుమారు ఎనభై సంవత్సరాల క్రిందటే ఋజువు చేసింది కదా !

- ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

# నిష్కామ యోగి బులుసు సాంబమూర్తి

మహాత్మాగాంధి మంత్రప్రభావం ఏమిటో తెలియదుకాని అనేకమంది నిత్యభోగులు కర్మ యోగులుగా, దరిద్రనారాయణులుగా, త్యాగధనులుగా పరివర్తనం చెంది దేశ స్వాతంత్ర్య సమరంలో చిరస్థాయిగా నిలిచిపోయారు. అట్టివారిలో మహర్షి బులుసు సాంబమూర్తిగారొకరు.

1886వ సంవత్సరం తూర్పుగోదావరి జిల్లా దుళ్ల గ్రామంలో జన్మించారు. లా డిగ్రీ తీసుకొని కాకినాడలో 1911వ సంవత్సరంలో ప్రాక్టీస్ పెట్టారు. త్వరలోనే అగ్రశ్రేణి ప్లీడర్లై పుష్కలంగా డబ్బు సంపాదించారు. మహాభోగిగా విలాసవంత జీవితం గడిపారు. ఇంతలో మహాత్మాగాంధి స్వాతంత్ర్యశంఖారావం విని భోగులు జోగులుగా మారి అహింసావాదులై ముందుకు రావలసినదిగా పిలుపు ఇచ్చారు. అంతే- వేలకి వేల రూపాయల సంపాదనను తృణ ప్రాయంగా వదలుకున్నారు. ఖరీదయిన విదేశీ వస్త్రాలను కుప్పగా వేసి తగులపెట్టారు. కేవలం అంగవస్త్రం మాత్రమే ధరించారు. మోటారుసైకిలు లేక జట్కా బండి లేనిదే బయటకు కదలని వారు పాదచారి అయ్యారు.

1929లో లాహోరులో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సభలో మాత్రమే సంపూర్ణ స్వాతంత్ర్యం తీర్మానం చేయబడింది. అంతకుపూర్వం వరకు అధినివేశ ప్రతిపత్తి గల పరిమిత స్వాతంత్ర్యంతో దేశనాయకులు సంతృప్తి పడ్డారు. కాని 1921లో జరిగిన గోదావరి జిల్లా కాంగ్రెస్ మహాసభలో బులుసు సాంబమూర్తిగారు, దీనబంధవి దువ్వూరి సుబ్బమ్మ, కళావెంకట్రావు ప్రభృతులు టంగుటూరి ప్రకాశంగారి అధ్యక్షతన సమావేశమై సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని డిమాండ్ చేస్తూ తీర్మానం చేసి చరిత్ర సృష్టించారు. ఈ తీర్మాన రూపకల్పనలో సాంబమూర్తి గారు ప్రధాన పాత్ర వహించారు.

**కన్నీటివే ముత్యాల మాలగా పేర్చి.**

1923 చివరలో కాకినాడలో మహ్మదాలీ అధ్యక్షతన కాంగ్రెస్ మహాసభలు చిరస్మరణీయంగా జరిగాయి. ఆ మహాసభలో ఆహ్వాన సంఘానికి బులుసు సాంబమూర్తిగారు అధ్యక్షులు-సభానిర్వహణ-అతిధులైన మహానాయకుల వసతి భోజన సదుపాయాలు సభ ఏర్పాట్లు వగైరాల్ని చూడవలసిన బాధ్యత సాంబమూర్తి గారిది. అంతకు కొద్ది రోజులు క్రితమే సాంబమూర్తిగారి ఏకైక పుత్రుడు మరణించాడు. ఆ దుఃఖాన్ని దిగమింగుకుని సభానిర్వహణలో ఎట్టిలోపం రానివ్వకుండా మహాసభలకు హాజరయిన ప్రతి ఒక్కరి ప్రశంసలను సాంబమూర్తిగారు చూరగొన్నారు. ఈ కర్తవ్య దీక్షకు పులకించిన భారతకోకిల సరోజినీ నాయుడు కన్నీటిని ముత్యాలమాలగా మార్చి స్వాగతం చెప్పారు. This Maharshi turned his tears of sorrow into garland of pearls to welcome అని ప్రశంసించారు.

# కంచి వాసుదేవరావు

తూర్పుగోదావరి జిల్లా స్వాతంత్ర్య సమర తొలి వృత్తాంతం ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా కాకినాడ సమీపంలో ఉన్న చొల్లంగి సముద్రతీరాన జరిగిన ఉప్పు సత్యాగ్రహం. ఇది మహాత్మాగాంధి గుజరాత్‌లో ప్రసిద్ధ దండి సత్యాగ్రహం జరిగిన రోజునే జరిగింది. అంతకు వారం రోజులకు ముందుగా సీతానగరంలోని గౌతమ ఆశ్రమం నుంచి షుమారు 200మంది దేశభక్తి గీతాలతో ప్రజలను చైతన్యవంతులనుచేస్తూ పాదచారులై మజిలీలు చేస్తూ ఏప్రిల్ 6వతేదీన చొల్లంగి చేరుకున్నారు. దీనికి నాయకులు సాంబమూర్తిగారు. ఆరోజు జరిగిన కాకినాడ సభలో తీవ్రమైన లాఠీచార్జీ జరిగింది. అనేకమంది గాయపడ్డారు. చొల్లంగిలో శాంతియుతంగా సత్యాగ్రహం చేస్తున్న దేశభక్తులపై పోలీసులు రాక్షసంగా ప్రవర్తించారు. ఈ సందర్భంలో గరిమెళ్ళ వీరభద్రరావు అనే సత్యాగ్రహి గుప్పిటలో ఉన్న ఉప్పును లాగుకోవడానికి పోలీసులు ఆయన చేతిని రక్తసిక్తంచేసినా, ఆయన పిడికిలి విప్పలేదు. ఇనుప నాడాల బూటుకాలితో కర్కశంగా పిడికిలిని తొక్కితే కాని ఆపిడికిలి విడిపడలేదు. ఆనాటి సాయంత్రం

కాకినాడలో జరిగిన బహిరంగసభలో రక్తసిక్తమై ఆ పిడికెడు ఉప్పును బహిరంగ వేలంవేయగా కాకినాడ ప్రముఖులు దేశభక్తుడైన పైండ వెంకటనారాయణగారు ఎంతో డబ్బుపెట్టి ఆ ఉప్పును కొన్నారు. పోలీసులు ఎంత రాక్షసంగా ప్రవర్తించినా సాంబమూర్తిగారి నాయకత్వంలో సత్యాగ్రహులు ఉప్పును జయప్రదంగా వండగలిగారు. దానితో పోలీసులకు సాంబమూర్తిగారంటే గంగవెర్రులెత్తేది.

ఆ రోజులలో పరమకిరాతకులైన ముస్తఫా ఆలీఖాన్ అనే సర్కిల్ ఇనస్పెక్టరు డప్పుల సుబ్బారావు అనే సబ్ ఇనస్పెక్టరు వుండేవారు. కాంగ్రెస్ సభలలో నాయకుల ప్రసంగాలు వినబడకుండా సుబ్బారావు కొందరి చేత డప్పులు వాయింప జేసేవాడుట. అందువలన ఆయన డప్పుల సుబ్బారావుగా ప్రసిద్ధుడయ్యాడు. గౌతమీ ఆశ్రమ స్థాపకులు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యాన్ని రాజమండ్రిలో పక్క ఎముకలు విరిగేట్టు లాఠీలతో కొట్టినవాడు, సీతా నగర ఆశ్రమాన్ని ధ్వంసం చేసినవాడు ముస్తాఫా ఆలీఖాన్.

1932 జనవరి 4వతేదీన కాకినాడలో పోలీసులు ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తున్న సాంబమూర్తిగారిని అతి తీవ్రంగా కొట్టారు. ఆనాటి సంఘటన గురించి మద్రానునుంచి ప్రకాశంగారి సంపాదకత్వంలో వెలువడుతున్న "స్వరాజ్య" 1932 జనవరి 21వతేదీ సంచికలో కళ్ళకు కట్టినట్లు వివరించారు.

## రాక్షసత్వానికి పరాకాష్ట

4వతేదీ సాయంత్రం శ్రీ కె. లక్ష్మీనరసింహ సోమయాజులు గారు అధ్యక్షులుగా కాకినాడలో బహిరంగ సభ జరిగింది. శ్రీ పారుపూడి సత్యనారాయణగారు ఉపన్యసిస్తున్నారు. చాలామంది స్త్రీ పురుషులు వాలంటీర్లు సభలో ఉన్నారు. ఇంతలో బులుసు సాంబమూర్తిగారు విచ్చేసి వేదికపై కూర్చున్నారు. ఆయన కోసమే వేచి ఉన్నట్లుగా వెంటనే సాయుధులైన పోలీసు డిప్యూటి జిల్లా సూపరింటెండెంటు(ముస్తాఫా ఆలీఖాన్ ) సర్కిల్ ఇనస్పెక్టర్ డప్పుల సుబ్బారావు రంగంలోకి దిగారు. డిప్యూటీ సూపరింటెండెంటు సాంబమూర్తి ఎవరు అని అడిగారు. "వీడే" అని సాంబమూర్తిగారిని చూపేడు డప్పుల సుబ్బారావు. "నీకు స్వరాజ్యం కావాలా ఇదిగో" అని డిప్యూటీ సూపరింటెండెంటు దబదబా సాంబమూర్తి గారిని లాఠీలతో మోదాడు. డప్పుల సుబ్బారావు సాంబమూర్తిగారిని నేలమీదకు ఈడ్చి లాఠీప్రయోగం చేశాడు. సభికులపై తక్కిన పోలీస్ బలగం విరుచుకుపడి చావబాదారు. సాంబమూర్తిగారు "శంభో" అని అరుస్తూ స్పృహకోల్పోయారు. ఐనా తన అక్కసు తీరని సర్కిల్ ఇనస్పెక్టరు ఆయన గుండెలపై బూటుకాలితో తన్నాడు. ఒక పోలీస్ సాంబమూర్తిగారిని గెడ్డంపట్టుకుని లాగాడు. పాతకాలంలో రాక్షసులు ఋషీశ్వరుల గెడ్డాలను పీకేవారని విన్నాం. ఇప్పుడు ఆ రాక్షసక్రీడ ప్రత్యక్షంగా ప్రదర్శించ బడింది. దగ్గరే ఉన్న దుర్గాబాయిగారు సాంబమూర్తిగారు మరణావస్థలో చిక్కుకున్నారని గ్రహించారు. వెంటనే పోలీసులకూ సాంబమూర్తిగారికీ మధ్యదూకి నా శవం దాటి సాంబమూర్తిగారిని ముట్టుకోండని గంభీరంగా అరిచారు. పోలీసులు ఆమెని గెంటివేశారు. మళ్ళీ మళ్ళీ ఆమె మధ్యకు దూకారు. అది మరపురాని అద్వితీయ అద్భుత ఘట్టం.

హిందుస్థానీ సేవాదళానికి ట్రెనింగు ఇవ్వడానికి కర్ణాటక నుంచి కాకినాడకు వచ్చిన దయానందరాజు అక్కడ ఉండి ఆ దృశ్యాన్ని సహించలేకపోయారు. డప్పుల సుబ్బారావు బూటుకాలికి అడ్డంపడి సాంబమూర్తిగారిని రక్షించాడు. ఎన్నో తన్నులు భరించారు. అహంకారం కోపాగ్ని చల్లారని డప్పుల సుబ్బారావు పక్కపక్కలనుండి లాఠీప్రయోగం చేశాడు. దధీచి, శిబి, కర్ణుడు వలె దయానందరాజు సాంబమూర్తిగారి రక్షణార్ధము ఆత్మార్పణకు సిద్ధపడ్డారు. ఇంత గందరగోళం జరిగాక డప్పుల సుబ్బారావు 144 సెక్షన్ ప్రకటన చదివాడు. అక్కడ ఉన్న పారుపల్లి సత్యనారాయణ కంభంపాటి మరో 50మంది లాఠీదెబ్బలకు గురయి కూడా శాంతియుతంగా నిలచిపోయారు (భారత స్వాతంత్ర్య సమరంలో గోదావరీ తీరం అనుబంధం 1,44-45 పేజీలు-సంకలనకర్త పిఎస్ శర్మ).

ఇంత దారుణంగా హింసించినా సాంబమూర్తి గారు ముస్తాఫా ఆలీఖాన్‌పైనకాని, డప్పులసుబ్బారావు పైనకాని కక్ష వహించలేదు. ప్రతీకారం తీర్చుకోవాలి అనుకోలేదు. అట్టి అవకాశం లభించినా వినియోగించు కోలేదు . ఎందుకంటే ఆయన అసలు సిసలైన గాంధేయ వాది కనుక. 1937 ఎన్నికల తర్వాత మద్రాస్ రాష్ట్రంలో రాజాజీ నాయకత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది.

మద్రాస్ శాసనసభలకు సాంబమూర్తిగారు స్పీకరుగా ఎన్నికయ్యారు, ఆనాడు సాంబమూర్తిగారిని దాదాపు ప్రాణం పోయేటంతవరకు హింసించిన ముస్తాఫా ఆలీఖాన్ తన ఉద్యోగానికి ఎక్కడ చేటు వస్తుందో అని భయంతో వణికి పోయాడు. సాంబమూర్తిగారు అతన్ని తన ఛాంబరు లోనికి పిలిచి "నువ్వు నీ విధి అనుకున్నది చేశావు భయపడకు నేను గాంధేయవాదిని ప్రతీకారం చేయడం మా సిద్ధాంతాలకు విరుద్ధం. నువ్వు నిర్భయంగా నీ డ్యూటీ చేసుకో" అని ధైర్యం చెప్పారు. ఇటువంటి ఉదాత్త ప్రవర్తనను నేటి మన రాజకీయనాయకులనుంచి ఆశించ గలమా?

అసలు సిసలు గాంధేయవాది పొట్టి శ్రీరాములు గారు ఆంధ్రరాష్ట్రసాధనకు మద్రాస్‌లో ఆమరణ నిరాహారదీక్షకు పూనుకున్నప్పుడు అందుకు మద్రాస్‌లోని సాంబమూర్తిగారి నివాసాన్ని ఎన్నుకున్నారు. తన ఆత్మార్పణ కార్యక్రమానికి సరిఅయిన స్థలం మహర్షి సాంబమూర్తిగారి నివాసం అని శ్రీరాములుగారు భావించడం సముచితమే.

## ధనకాంక్షను జయించిన నిష్కామయోగి

ధనకాంక్షను జయించడం, డబ్బువట్ల నిరాసక్తంగా ఉండటం ఎంతో సాధనచేసిన నిష్కామ యోగులకు మాత్రమే సాధ్యం. జేబులో ఒక రూపాయి లేకపోయినా మర్నాడు ఎల్లా గడుస్తుందో తెలియకపోయినా అటువంటివారు డబ్బు గురించి ఆలోచించరు. దాచుకోవాలని అనుకోరు. డబ్బుతో తమకు అవసరం ఉన్నట్లు భావించరు. వారి అవసరాలను గుర్తించిన మిత్రులు డబ్బు ఇస్తూ ఉంటారు. ఎందుకు ఇచ్చారు ఎవరు ఇచ్చారు అన్న ఆలోచన వారికి ఉండదు. ఆ డబ్బునయినా జాగ్రత్తగా ఖర్చుపెట్టుకోవాలి అనుకోరు. అట్టి అపురూప వ్యక్తి సాంబమూర్తిగారు. సుప్రసిద్ధ స్వాతంత్ర్యసమరయోధులు, పత్రికా రచయిత క్రొవ్విడి లింగరాజుగారి కుమారుడు సత్యనారాయణగారు సాంబమూర్తిగారి గురించి చేసిన ప్రస్తావనలో ఇట్లా అంటారు "సాంబమూర్తిగారి ఇంట్లో బల్లమీద ఆయన ఖర్చులనిమిత్తం ఎవరో ఇచ్చిన డబ్బు ఉండేది. ఎంత ఉండేదో ఆయనకే తెలియదు. ఎవరయినా సహాయానికి వస్తే అదిగో బల్లమీద డబ్బు ఉంది నీకు కావలసింది తీసుకోమనేవారు. అతను ఎంత తీసుకొన్నదీ తనకెంత మిగిలిందన్న ఆలోచన ఉండేదికాదు. తన ఇంటికి వచ్చిన ప్రతిఒక్కరినీ ఎంతో ఆప్యాయంగా ఆదరించేవారు. బల్ల మీద ఉన్న డబ్బు తీసుకుని కావలసింది తిని రమ్మనమని అనేవారు. తన గురించి ఆలోచించుకొనేవారుకారు.

సాంబమూర్తిగారికి అన్ని విధాలా తగిన ఇల్లాలు సుభద్రమ్మగారు. భర్తతోపాటు అన్ని కష్టాలను సంతోషంగా భరించారు. తన బంగారు వెండి నగలన్నిటినీ ఒక్కటి కూడా ఉంచుకోకుండా స్వరాజ్యనిధికి విరాళంగా ఇచ్చిన త్యాగశీలి. సహాయనిరాకరణాది జాతీయ కార్యక్రమాలలో పాల్గొన్న ఏకైక కుమారుడు మరణించి నప్పుడు తన భర్తమాదిరి స్థితప్రజ్ఞత్వంతో జాతీయో ద్యమాలలో పాల్గొన్న త్యాగమయి.

ఇటువంటి సాంబమూర్తిగారిని తరువాతితరం కాంగ్రెస్ నాయకులు మర్చిపోయారు. 1967 ప్రాంతంలో జరిగిన ఒక సంఘటనను క్రొవ్విడి లింగరాజుగారు చెప్పారు. హైదరాబాదు గాంధీభవన్‌లో ఆనాటి కాంగ్రెస్ పెద్దల ముందు సాంబమూర్తిగారి ప్రస్తావన తెచ్చినపుడు వాళ్ళలో ఎవరికీ ఆయన గురించి తెలియదట. మరి ఇప్పటి కాంగ్రెస్ నాయకులలో సాంబమూర్తిగారి గురించి అసలు తెలియక పోయినా ఆశ్చర్యపడవలసిన అవసరం ఉండదుకదా! ఇప్పటిది పూర్తిగా భిన్నమైన కాంగ్రెస్ సంస్కృతి.

## సుభాషితములు

"గౌరవం లభ్యతే దానాత్
న తు విత్తస్య సంచయాత్
స్థితి రుచ్చై: పయోదానాం
పయోధీనామధ: స్థితి:"

దానము చేయుట వలన ధనమునకు గౌరవము లభించుచున్నది. కూడ బెట్టుట వలన మాత్రము గౌరవము లభించదు. అదే విధముగా నీటిని యిచ్చెడి మేఘముల ఉనికి ఉన్నతమైనది. నీటిని కూడబెట్టెడి సముద్రము ఉనికి మాత్రము అధమమైనది.

సూక్తిసుధ

# విద్య

విద్యనభ్యసించడం ఉద్యోగం కోసమని , ధన సంపాదనకేననే అభిప్రాయం ఈనాడు చాలామందిలో ఉన్నది. అంతేకాదు విద్య అంటే చదవటం, వ్రాయటం, మంచి మార్కులు తెచ్చుకోవటం, డిగ్రీలు, ర్యాంకులు సంపాదించటం అనే అభిప్రాయం కూడా ఉన్నది. ఇది సరియైన భావన కాదు. "నైతిక, ఆధ్యాత్మిక, శీల సంపత్తులను ఇనుమడింపజేయునదే సరియైన విద్య' అని మహాత్మాగాంధీజీ ఏనాడో పేర్కొనినారు.

"సా విద్యా యా విముక్తయే'' విముక్తిని కలిగించేది 'విద్య' అని పెద్దలు ఏనాడో చెప్పారు. అనగా అజ్ఞాన అహంకారములనుండి, స్వార్దసంకుచితత్వముల నుండి, అసహనమునుండి, అంతఃశ్శత్రువులనుండి విముక్తిని కలిగించేదే విద్య. అంతఃకరణమును పరిశుద్ధం గావించునదే విద్య. వినయ విధేయతలను చేకూర్చునదే విద్య. విజ్ఞానంతోపాటు వివేక విచక్షణా జ్ఞానములను అభివృద్ధి పరుచునదే విద్య. అనుభవజ్ఞానము, లౌకిక జ్ఞానములను అందించునటువంటిదే నిజమైన విద్య.

అయితే ఇటువంటి విద్యను ఎప్పుడు అభ్యసించాలి? 'శైశవే2భ్యస్త విద్యానాం'' అన్నారు. మన పెద్దలు. విద్య బాల్యమునందే అభ్యసించాలి. అప్పుడే బాగా ఒంటపడుతుంది. అప్పుడు నేర్చుకున్నది, అలవరచు కున్నది మాత్రమే జీవితాంతం బాగా గుర్తు ఉంటుంది. మధ్యలో నేర్చుకున్నది మధ్యలోనే పోతుంది. కనుక ప్రతి ఒక్కరు అట్టి అమూల్యమైన బాల్యదశను సద్వినియోగం చేసుకోవాలి. విద్యాధనమును ప్రతిఒక్కరూ సంపాదించాలి. అట్టి విద్యాధనమును ఎవరూ కాజేయలేరు.

"నభోగహార్యా న చ బన్దు హార్యా
న భర్తృహార్యా నచ రాజహార్యా
స్వదేశమిత్రం పరదేశ బన్దుః
విద్యా సుధాం యే పురుషా పిబన్తి".

విద్యాధనమును అనుభవించటంచేత ఏమాత్రం తరిగిపోదు, నశించిపోదు. బంధువులచేతనూ, సోదరులచేతనూ, రాజులచేతనూ అపహరించబడదు. స్వదేశమునందు మిత్రునివంటిది. పరదేశమునందు బంధువువంటిది. మానవుడు సంపాదించిన భౌతిక సంపదలు ఏదోఒకరోజున , కాలం మార్పు వలన కాలగర్భంలో కలిసిపోవచ్చును, శిథిలం కావచ్చును, నశించి పోవచ్చును. అగ్నికి ఆహుతి కావచ్చును. ప్రకృతివిలయ తాండవానికి బలికావచ్చును. దొంగలు దోచుకోవచ్చును. దాయాదులు కాజేయవచ్చును. అన్నదమ్ములు స్వాహా చేయవచ్చును. బంధువులు భగ్నంచేయవచ్చును. కాని ఈ విద్యాధనమునుమాత్రం ఎవరూ దోచుకోలేరు

**కొమరగిరి కృష్ణమోహనరావు**

ఈ విద్యాధనం ఎంతమందికి దానం చేసినా తరగదు. దినదిన ప్రవర్ధమానంగా పెరిగి అభివృద్ధి చెందుతూ ఉంటుంది. చెలమ చిమ్మినకొద్దీ ఏవిధంగా ఊరుతుంటుందో, అదేవిధంగా పదిమందికి నేర్పిన కొద్దీ ఈ విద్య పెరుగుతుందే కాని తరగదు. అంతేకాదు స్వదేశమందు మిత్రుడిలా, పరదేశమునందు బంధువులా అండగా నిలుస్తుంది. అవసరమైనప్పుడు ఆదుకుంటుంది.

"విద్వాన్ సర్వత్ర పూజ్యతే'' విద్వాంసుడు ఒక్క స్వదేశమునందేకాదు, అన్నిదేశములందు, అన్ని ప్రదేశముల యందు గౌరవించబడుతాడు, పూజింపబడుతాడు. విద్య కాలము కాని కాలమందు ఫలమొసంగుతుంది. పరిచయము లేని పరదేశమునందు తల్లివలె పోషిస్తుంది. కష్టకాలమందు నిల్వయున్న ధనమువలె సహాయ పడుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే "సర్వద్రవ్యేషు విద్యైవ ద్రవ్యమాహురనుత్తమమ్'' అన్నిద్రవ్యములలోకెల్లా విద్యాద్రవ్యమొక్కటే గొప్పది, శాశ్వతమైనది. భౌతికమైన

సిరిసంపదల కన్నా విద్యాధనము ఎన్నోరెట్లుమిన్న. దీనివిలువకట్ట ఎవరికీ శక్యముకాదు, సాధ్యం అంతకన్నా కాదు. కనుక ఇటువంటి నశింపులేనట్టవంటి, శాశ్వత మైనటువంటి, వెలకట్ట లేనటువంటి, అమూల్యమైనటు వంటి ఈ విద్యాధనమును సంపాదించినవారికి ఎట్టి భయమూ ఉండదు. కనుక ప్రతిఒక్కరూ ఈ విద్యా ధనమును సంపాదించి తరించాలి.

"విద్యావిహీనః పశుభిః సమానాః" విద్యలేనివాడు వింతపశువు అన్నారు మనపెద్దలు. పశువుతో సమానమన్న మాట. కనుక విద్యలేనివాడు ఎందుకూపనికి రాడు. మానవునికి సరిమైన అలంకారం విద్య ఒక్కటే. భౌతిక అలంకారములు ఏమాత్రం శాశ్వతంకావు. కాలక్రమమున అవి క్షీణించి, అరిగి, తరిగి, నశించి కాలగర్భంలో కలిసి కనపడకుండా పోతాయి. విద్యఒక్కటే సరియైన భూషణం. అది ఒక్కటే శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలను ఆర్జించి పెడుతుంది. కనుక అట్టి విద్యను బాల్యమునుంచే అభ్యసించాలి. ఈసదవకాశమును జారవిడచుకుంటే భవిష్యత్తులో చింతించవలసి వస్తుంది. కనుక బాల్యదశను సద్వినియోగం చేసుకోండి! జీవితాన్ని సార్థకం చేసుకోండి!

"సత్ప్రవర్తన, సద్బుద్ధి, సత్యనిరతి
భక్తి, క్రమశిక్షణ, కర్తవ్యపాలనంబు
నేర్పునదేవిద్య అద్దాని నేర్వవలయు"

*(ఆకాశవాణి సౌజన్యంతో ది. 13-7-1998)*

## సనత్సుజాత ఉవాచ

వికత్థనః స్పృహయాళుర్మన స్వీ
బిభ్రత్కోపం చపలోఽ రక్షణశ్చ
ఏతాన్ పాపాః షణ్ణరాః పాపధర్మాన్
ప్రకుర్వతేనోత్ర సంతః సుదుర్గే

ఆత్మస్తుతిగావించుకొనువాడు, దురాశ గలవాడు, అభిమాని, కోపి, చపలుడు, ఆశ్రితుల్ని రక్షించలేని వాడు- ఈ ఆరుగురు పాపాలనాచరిస్తూ ఉంటారు. ఉత్తములు, ఇటువంటి దుర్మార్గులు సంచరించే మార్గంలో ప్రవేశించరు.

# పదాల పందిరి - 13

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | * | 2 | * | 3 | 4 |
| | * | 5 | | 6 | * | |
| 7 | | | * | 8 | | |
| * | * | | * | | * | * |
| 9 | | | * | 10 | | 11 |
| | * | 12 | 13 | | * | |
| 14 | | * | | * | 15 | |

ఆధారాలు :

నిలువు : 1. ఖరము, 2. మశకం, 4. నది గట్టు తెగితే వచ్చేది, 5. అర్జునుడు, 6. రాత్రి పూట విహరించువారు, 9. మండుట, 11. బర్మా రాజధాని, 13. మోహం వికృతి, మరి ప్రకృతి?

అడ్డం : 1. ధాన్యం నిలువ చేయు స్థానం, 3. పడవ, 5. సిర కాదు, రక్త నాళిక, 7. సంహారం. 8. సరస్వతీ దేవి, 9. జటాయువు తోక కత్తిరిస్తే, 10. రక్తం, 12 'వు' లేని ప్రథమావిభక్తి, 14. శివవాహనం, 16. సంవత్సరం లోని ఆరవ నెల.

- కిరీటి

జవాబులు వచ్చే సంచికలో

(8వ పేజీ తరువాయి)

## 'ఆంధ్రకేసరి' ప్రకాశం

1928వ సం॥ లో మద్రాసు నగరానికి సైమన్ కమీషన్ వచ్చినప్పుడు నిరసన ప్రదర్శనలు జరిగాయి. 'సైమన్ గోబ్యాక్" అంటూ నినాదాలు చేస్తూ ఊరేగింపులు జరిగాయి. పోలీసులు కాల్పులు కాల్చగా కొంతమంది యువకులు మరణించారు. ఆ మృత దేహాలను చూడటానికి ప్రకాశం గారు బయలుదేరారు. దారిలో పోలీసులు అడ్డగించారు. కాని ప్రకాశంగారు తన అనుచరులతో ముందుకు సాగిపోతున్నారు. అధికారి ఆజ్ఞ ప్రకారం సైనికులు తుపాకులు చేబూని బారులు తీర్చినుంచున్నారు. "తుపాకులు కాల్చడానికి మీకు ఉత్తరువులు వుంటే మా శరీరాలలోనికి గుండ్లు పోనివ్వండి" అని ప్రకాశం తన ఎదురురొమ్మును చూపుతూ ముందుకు నడిచాడు. 'ఊ ! షూట్ చేయండి!' అని అధికారి ఉరిమాడు. "ప్రకాశం వర్థిల్లాలి" అంటూ జన సమూహం జేజేలు పలికింది. అధికారి ఆపరిస్థితిని చూచి నివ్వెరపోయి ప్రకాశంగారిని పోనిస్తాడు. ఈ చారిత్రాత్మక సంఘటన దేశాన్ని ఉగ్రూతలూగించింది. ప్రకాశంగారి అద్భుత ధైర్య సాహసాలను ప్రశంసిస్తూ ముట్నూరి కృష్ణారావు గారు 'కృష్ణాపత్రిక' లో సంపాదకీయం వ్రాస్తారు. ఆ సంపాదకీయంలో ప్రప్రథమంగా ప్రకాశంగారిని 'ఆంధ్రకేసరి' అని బిరుదుయిచ్చి ప్రస్తుతించింది ముట్నూరి వారే.

ప్రకాశం అద్వితీయమైన ధైర్యసాహసాలు గల త్యాగశీలి. పిరికి జేరలేని సమరవీరుడు. లక్షలు ఆర్జించిన ఐశ్వర్యవంతుడు. అయినా సంపదను అసహ్యించు కొనేవారు. లేమిని ఆహ్వానించి అనుభవించారు. చివరి దశలో కనీస అవసరాలను తీర్చుకోవడానికి కూడా ధనం లేక పేదరికాన్ని అనుభవిస్తూ కూడా ఆదర్శ జీవితాన్ని గడిపిన త్యాగశీలి.

ఆ రోజులలో బారిష్టర్‌గా ఆయన లక్షలు సంపాదించేవాడు, పేదలకు ఖర్చు చేసేవాడు. ఆనాడు ఆయన చరాస్థులు గమనిస్తే ఆశ్చర్యం వేస్తుంది. 1. ఊటిలో ఒక పెద్ద బంగళా. 2. మద్రాసులో బంగళా. 3. రాజమండ్రిలో 6వేల చ.అ. ఇల్లు 4. రాజమండ్రి సెంట్రల్ జైల్ ప్రాంతంలో 100 ఎకరముల భూమి. 5. పశ్చిమ గోదావరి పోణంగిలో 40 ఎకరముల పొలము. 6.రైల్వే షేర్లు ఒక లక్ష. 7. గవర్నమెంటు బాండ్లు ఒక లక్ష. 8. మద్రాస్ కార్పోరేషన్ డిబెంచర్లు రు॥ 15వేలు. 9. ఆంధ్రా బ్యాంక్ డిపాజిట్లు రు॥ 50 వేలు ఉండేవి. స్వాతంత్ర్య పోరాట కాలంలో ఇవన్నీ కరిగి పోయి ఆయన అవసాన దశలో ఎవ్వరైనా టిక్కెట్టు కొనియిస్తే రైలులో ప్రయాణం చేయగలిగే స్థితి ఏర్పడిందంటే ఆశ్చర్యంగానే ఉంటుంది !

స్వాతంత్ర్యోద్యమంలో తన సర్వస్వాన్ని త్యాగం చేసి, త్యాగంలోని ఆనందాన్ని పుష్కలంగా అనుభవించిన త్యాగశీలి ప్రకాశం పంతులుగారు.

## దాదాభాయ్ నౌరోజి

బ్రిటీష్ పార్లమెంటుకు ఎన్నికయిన మొదటి భారతీయుడు 'దాదాభాయ్ నౌరోజి. 1892వ సం॥లో బ్రిటీష్ పార్లమెంటులోని కామన్స్ సభకు జరిగిన ఎన్నికలలో సెంట్రల్ ప్రిన్స్‌బరీ నియోజకవర్గము నుండి పోటీ చేసి ఘన విజయమును సాధించాడు. ఇది బ్రిటీష్ సామ్రాజ్య చరిత్రలో నూతన అధ్యాయమును సృష్టించింది. 1886వ సం॥ లో కలకత్తాలో జరిగిన భారత జాతీయ కాంగ్రెసుకు అధ్యక్షునిగా ఎన్నుకోబడినాడు. మరల 1893వ సం॥లో లాహోర్‌లో జరిగిన భారత జాతీయ కాంగ్రెసును రెండవ పర్యాయం అధ్యక్ష పదవిని నౌరోజి అలంకరించారు. అప్పటికి ఆయన బ్రిటీష్ పార్లమెంటు సభ్యుడు. లండన్ నుంచి బొంబాయిలో ఓడ దిగి పార్టీ వారు ఏర్పాటు చేసిన బంగళాలో విడిది చేయకుండా సరాసరి తన పాత ఇంటికి వెళ్ళిపోతాడు. ఇది ఆయన నిరాడంబరతకు చిహ్నం. బొంబాయి నుండి లాహోర్ వరకు ఆయనకు ఘనస్వాగతం లభిస్తుంది. కాంగ్రెసులో చీలిక రాకుండా ఉండటానికోసం 1906 సం॥లో మరల మూడవసారి అధ్యక్ష పీఠమును నౌరోజి అలంకరించారు. ఒకపారశీకుడు మూడుసార్లు కాంగ్రేసు అధ్యక్ష పీఠమును అలంకరించడం విశేషమే ! దాదాభాయ్ నౌరోజి సార్థక నామధేయుడు. భారతదేశ రాజకీయరంగంలో మనుమలు, మునిమనుమలచే చిరస్మరణీయంగా గుర్తించబడిన వ్యక్తి. అందుకనే ఆయనను "The grand oldman of India"అని పిలిచేవారు. పారశీక భాషలో 'దాదా' అనగా తాత. 'భాయ్'అనగా అన్న. "నౌరోజి" అనగా ఉగాది అని అర్థం. భారత జాతీయ ఉద్యమ చరిత్రలో తాతగా, పెద్దన్నగా, నవశకము నకు ఉగాదిగా, గుర్తించ బడిన వ్యక్తి 'దాదాభాయ్ నౌరోజి'భారత ప్రజల యొక్క ఆదరాభిమానములను పొందిన ధన్యజీవి నౌరోజి.

## లాలాలజపతిరాయ్

అది 1928వ సం॥ అక్టోబర్ 30వ తేది. సైమన్‌కమీషన్ రాకకు నిరసనగా జరిగిన నిరసన ప్రదర్శనకు

లాలాలజపతిరాయ్ నాయకత్వం వహించారు. ప్రశాంతంగా జరుగుతున్న ప్రదర్శన పై పోలీసులు అమానుషంగా లాఠీ ఛార్జీ జరిపారు. బ్రిటీష్ పోలీసుల పాశవిక చర్యకు అమాయక ప్రజల చేతులు, కాళ్ళు ఎందరివో విరిగాయి. అయినప్పటికి ప్రజలు ప్రశాంతంగా 'సైమన్ గోబ్యాక్' 'సైమన్ హటావో' నినాదాలు చేస్తూనే ఉన్నారు. వృద్ధనాయకుడు లాలాజీ మీద పోలీసుల క్రూర దృష్టిపడింది. ' లాలాజీని పట్టుకోండి' అని పోలీస్ సూపరింటెండెంట్ 'స్కాట్'లు హూంకరించాడు. అసిస్టెంట్ సూపరింటెండెంట్ 'స్యాండర్స్' నాయకత్వంలో ఒక పోలీసు దళం లాలాజీ మీదకు దుముకబోతున్నది. అది చూచిన భగవతీచరణ్, సుఖదేవ్, యశపాల్ మొదలగు విప్లవవీర కిశోరాలు లాలాజీకి వలయం కట్టారు. లాలాజీకి ఎండ తగలకుండా అడ్డంపెట్టిన గొడుగు మీద 'స్యాండర్స్' పొడుగు లాఠీ విరుచుకు పడింది. గొడుగు విరిగిపోయింది. వలయాకారం పట్టిన వీర కిశోరాలపైన వందలాది లాఠీలు ప్రయోగించబడ్డాయి. తలలు పగిలాయి, రక్తం చిమ్మింది. లాలాజీమీద కూడా దెబ్బపై దెబ్బపడింది. ఆయన దేహం నుండి కూడా రక్తం కారడం మొదలైంది. రొమ్ముపై బలమైన లాఠీ దెబ్బపడింది. లాలాజీ కుప్పగా కూలిపోయారు. ప్రజలను చెదిరిపోండని లాలాజీ హెచ్చరించారు. విరిగిన కాళ్లు, చేతులు, చెదిరిన జుట్టు, పగిలిన తలలు, చిట్లిన శరీరాలు, చినిగిన చొక్కాలతో ప్రజలు ఇంటి ముఖం పట్టినప్పటికి పోలీసులు లాఠీలతో తరుముతూనే ఉన్నారు. లాహోర్ అంతా స్మశాన నిశ్శబ్దం ఆవరిస్తుంది. పోలీసుల అకృత్యాలకు సంపూర్ణ హర్తాళ్ జరుగుతుంది. ఆ రోజు సాయంత్రం జరిగిన నిరసన బహిరంగ సభకు వేలాదిమంది ప్రజలు విచ్చేస్తారు. కట్టు కట్టుకొని లాలాజీ వేదిక మీదకు రావటంతోనే ప్రజలు నినాదాలు చేస్తారు. తమప్రియతమ నాయకుని ఆ స్థితిలో చూడవలసివచ్చినందులకు బాధ పడుతూ కంటి వెంబడి నీరు కారుస్తారు. పంజాబు కేసరి లేచి " నిరపరాధ ప్రజలపై దాడిచేసిన ప్రభుత్వాన్ని నాగరిక ప్రభుత్వమని పిలవడానికి ఎలాంటి హక్కులేదు." అని గర్జిస్తాడు. అక్కడనే ఉన్న డిప్యూటి సూపరింటెండెంట్ 'నీల్' వైపు చూచి లాలాజీ "జ్ఞాపకముంచుకో ! నన్ను కొట్టిన ప్రతి లాఠీ దెబ్బ భారత దేశంలో ఆంగ్లేయుల పరిపాలన యొక్క శవపేటికపై కొట్టబడిన చివరి మేకులవుతాయి. జాగ్రత్త ! " అని సింహగర్జన చేస్తాడు. లాలాజీ ఆరోగ్యం నానాటికి క్షీణించి పోతుంటుంది. 1929వ సం॥ నవంబరు 17న పంజాబు కేసరి కన్నుమూస్తుంది. స్యాండర్స్ దెబ్బలే లాలాజీ మరణానికి కారణమని వైద్యాధికారులు ప్రకటిస్తారు. ఆనాడు జరిగిన లాలాజీ శవ యాత్రలో కనీవిని ఎరుగని రీతిలో జనం పాల్గొంటారు. లాలాజీ మరణంతో ముఖ్యంగా యువతలో ఉద్వేగంతోపాటు సవాలును స్వీకరించాలనే పట్టుదల ప్రబలుతుంది. లాలాజీ మరణ వార్తవిని, చిత్తరంజన్‌దాస్ సతీమణి 'బసంతీదేవి' లాహోర్ వచ్చి ఒక సంతాప సభలో మాట్లాడుతూ " లాలాజీ మరణం భారతీయ యువతలో ఆత్మగౌరవం నశించడానికి చిహ్నం. ఈదేశంలో పురుషత్వం, యవ్వనం ఇంకా జీవించే ఉన్నాయా? మన ప్రియతమ లాలాజీ చితిమంటలు చల్లారకమునుపే, దీనికి యువలోకం జవాబు చెప్పాలి'' అని ప్రళయకాల రణ చండికలా గర్జిస్తుంది. డిశంబర్ 10వ తేదీన లాహోర్‌లోని 'బోయింగ్ హౌస్' లో విప్లవవీరులు రహస్య సమావేశం జరుపుతారు. అందులో భగత్‌సింగ్ మాట్లాడుతూ లాలాజీ మరణం జాతికే తీరని అవమానం. జాతికి జరిగిన ఈ అవమానాన్ని తొలగించడం విప్లవ కారుల తక్షణ కర్తవ్యం. విప్లవకారులకు పగతీర్చుకునే శక్తి, సామర్థ్యం, ధైర్యం వున్నదని ప్రపంచానికి తెలియ జెప్పాలి. తెల్లదొరల తుపాకి గుండ్లకు, మర ఫిరంగుల శబ్దాలకు భారత యువత ఏ మాత్రం చలించదని నిరూపించాలి. దెబ్బకు దెబ్బ తీయగల శక్తి సామర్థ్యములు విప్లవవీరులకు కలదని ఋజువు చేయాలి'' అని చేసిన ఉద్రేకపూరితమైన ఉపన్యాసం విప్లవకారులను కదిలించి వేస్తుంది. 'వందేమాతరం ' అనే నినాదం మారు మ్రోగుతుంది. లాలాజీ మరణం నవంబరు 17న జరుగుతుంది. సరిగా మాసిక తిథి డిశెంబరు 17న ఒక పథకం ప్రకారం పోలీస్ స్టేషన్ ముందు గేటు వద్దనే అసిస్టెంట్ సూపరిండెంట్ ' స్యాండర్స్‌ను భగత్‌సింగ్ , రాజగారులు కాల్చి చంపుతారు. యావత్ భారతం సంతోషిస్తుంది. యువత ఆనందోల్లాసాలకు అవధులు లేకుండా పోయింది. యువశక్తి కదం త్రొక్కింది. పరదేశీ ప్రభుత్వానికి గుణపాఠం నేర్పడానికి భాఠత యువశక్తి విజృంభించింది.

లాలాజీ మరణవార్త విన్న గాంధీజీ నిర్వీర్యుడై లాలాజీ వీరుడు వీరమరణం పొందినాడు. సూర్య చంద్రులున్నంత వరకు లాలాజీ వంటి మహాత్ములకు మరణం లేదు. లాలాజీ ఒక వ్యక్తికాదు. ఆయన "ఒక మహా సంస్థ'' అని అంటారు.

"లాల్,బాల్,పాల్'' అనే పేరుతో అతివాద త్రయంగా భారత ప్రజల హృదయాలలో చిరస్మరణీయంగా నిలిచారు. వారిలో మొదటివారు పంజాబు కేసరి

లాలాలజపతిరాయ్. రెండవ వారు మహారాష్ట్ర కేసిర బాలగంగాధరతిలక్. మూడవవారు బెంగాల్ కేసరి బిపిన్ చంద్రపాల్. భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రకు ఈ ముగ్గురూ మూలపురుషులు. వారు యువతకు యిచ్చిన స్ఫూర్తి ప్రజలకు చూపిన మార్గదర్శకత్వము వలననే భారత్‌కు స్వాతంత్ర్యం సిద్ధించింది అనటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

స్వాతంత్ర్య సమర సంగ్రామంలో తమ సర్వస్వాన్ని సమర్పించిన త్యాగధనులలో కొందరిని, అమర వీరులలో మరికొందరిని ఈ వ్యాసంలో కొంతవరకు పరిచయం చేయగలిగాను. ఇంకా ముఖ్యులెందరో మిగిలి పోయినారు. వారందరి గురించి వ్రాయాలంటే ఒక మహా ఉద్గ్రంధ మవుతుంది. మనకు స్వాతంత్ర్యము తెచ్చిన గాంధీజీ, నేతాజీ, నెహ్రూజీలను గురించే వ్రాయనందులకు చింతిస్తున్నాను. అయితే వారిని గురించి ఈ తరం వారిలో చాలామందికి తెలుసుకాబట్టి వ్రాయలేదు. చాలామందికి తెలియని వారిని గురించి మాత్రమే ఈ వ్యాసంలో ప్రముఖంగా ప్రస్తావించాను. ఏది ఏమైనప్పటికీ ఈ స్వాతంత్ర్య సమర సంగ్రామంలో పాల్గొనిన వీరాధి వీరులందరికి నా జోహార్లు. ఈనాడు మనం స్వేచ్ఛా వాయువు లను పీల్చగలుగుతున్నామంటే ఆనాడు వారు చేసిన త్యాగ ఫలితం మాత్రమే.

ఈ జాతి ఈనాడు స్వర్ణోత్సవాలను జరుపు కుంటున్నది. సంతోషించవలసిన స్వర్ణభారతి కన్నీరు కారుస్తున్నది. ఆమె విలపిస్తున్నది. ఆమె హృదయం పరితపిస్తున్నది. ఆమె మనస్సు వికలమైంది. ఆమె ఆవేదనతో ఆక్రందన చేస్తున్నది. కారణం? ఈ స్వతంత్ర్య భారతావనిలో ఈనాడు కొందరు స్వార్ధ పరులు కులం పేరుతో క్రుమ్ములాడుకుంటూనే ఉన్నారు. మతం పేరుతో మారణహోమాలను సృష్టిస్తూనే ఉన్నారు. బంధు పక్షపాతం, ఆశ్రితపక్షపాతం, అధికార వ్యామోహం, విలయ తాండవం చేస్తూనే ఉన్నాయి. అవినీతి వికటాట్టహాసం చేస్తున్నది. పశువుల ఆహారమైన గడ్డి, దాణాలను ఈనాడు కొందరు నాయకులు భక్షిస్తున్నారు. పశువులు గడ్డి తిని మనుష్యులకు పాలను అందిస్తున్నాయి. గడ్డిని తిన్న నాయకులు మాత్రం అవినీతిపాల(న)ను అందిస్తున్నారు. ఇది ఈనాటి స్వర్ణభారత పరిస్థితి, మన దుస్థితి.

స్వాతంత్ర్య సమర సంగ్రామంలో తమ సర్వస్వాన్ని సమర్పించి, అశువులు బాసిన అమరవీరులు, ఈనాటి స్వర్ణభారతి దుస్థితిని చూచి పరితపిస్తుంటారు. వారి ఆత్మలు సంక్షోభిస్తుంటాయి. స్వర్ణభారతి కన్నీరును తుడిచేవారులేరా? అమరవీరుల ఆత్మలను సంతోష పెట్టేవారు లేరా? ఈ జాతి అంత నిర్వీర్యమైపోయిందా?

ఉన్నారు...ఉన్నారు.... ఈ దేశంలో ధైర్యశాలురైన ధీరులకు లోటులేదు, యువతరానికి కరువులేదు. అయితే వారిని సరియైన మార్గంలో నడిపించవలసిన నాయకులలో చాలామంది స్వార్ధపరులు కావటం వలన, అధికారమే అట్టి వారి పరమావధి కావటం వలన ఈనాటి యువత దిక్కు తోచని స్థితిలో పడిపోయింది. ఈ స్థితి మారాలి. ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురు చూడటం విజ్ఞత కాదు. ఎవరికి వారు తమ కర్తవ్యాన్ని గుర్తించాలి. సమాజ శ్రేయస్సే పరమావధిగా భావించి, కార్యశూరులై కదనరంగంలోనికి కొదమసింహంలా కుప్పించి దూకాలి. అకుంఠిత దీక్షతో, ఆత్మవిశ్వాసంతో ముందుకు నడవాలి. త్యాగమే పరమావధిగా భావించే త్యాగరాజులు కావాలి. అవినీతిని పటాపంచలు చేయటానికి యువలోకం కంకణం కట్టుకోవాలి. అవినీతి పరులైన నాయకులను సముచితమైన రీతిలో సన్మానించడానికి యువత ముందుకు రావాలి. అప్పుడే స్వర్ణభారతి శాంతిస్తుంది. ఆమె మనస్సు సంతృప్తి చెందుతుంది. ఆమె కారుస్తున్న దుఃఖాశ్రువులు, ఆనంద బాష్పాలుగా మారుతాయి. ఆనాడే అమరవీరుల ఆత్మలు సంతోషిస్తాయి.

**లెండి! మేల్కొనండి! విశ్రమించకండి!**
**కార్యోన్ముఖులవ్వండి!**
**కర్తవ్య పరాయణులవ్వండి!**

వందే మాతరం

భారతమాతాకీ జై

*మీ విజ్ఞానాన్ని, విద్వత్తును, విజ్ఞతను ఒక ప్రక్కన; సత్యాన్ని, నిర్మలత్వాన్ని మరోప్రక్కన ఉంచి తూచితే ముల్లు సత్య నిర్మలత్వముల వైపే మొగ్గుతుంది. శీలరహితమైన విజ్ఞానం ఒక దుష్టశక్తి.*

- మహాత్మాగాంధి

# సిద్ధిదాత్రి

"సిద్ధ గంధర్వ యక్షద్యై రసురై రమరైరపి
సేవ్యమానా సదా భూయాత్ సిద్ధిదా సిద్ధిదాయినీ."

దుర్గామాత యొక్క నవమ శక్తిని 'సిద్ధిదాత్రి' అంటారు. మార్కండేయ పురాణానుసారం అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశిత్వ, వశిత్వ - ఇవి అష్టసిద్ధులు. బ్రహ్మ వైవర్త పురాణ శ్రీ కృష్ణ జన్మ ఖండంలో ఈ ప్రకారంగా ఉన్నాయి. 1. అణిమ, 2. లఘిమ, 3. ప్రాప్తి, 4. ప్రాకామ్య, 5. మహిమ, 6. ఈశిత్వ, 7. వశిత్వ, 8. సర్వకామావసాయిత్వ, 9. సర్వజ్ఞత్వ, 10. దూరశ్రవణ, 11. పరకాయ ప్రవేశం, 12. వాక్‌సిద్ధి, 13. కల్పవృక్షత్వం, 14. సృష్టి, 15. సంహారకరణ సామర్ధ్యం, 16. అమరత్వం, 17. సర్వనాయకత్వం, 18. భావన, 19. సిద్ధి.

సిద్ధిదాత్రి దేవి భక్తులకు, సాధకులకు సర్వ సిద్ధులనూ ప్రసాదించడంలో సమర్ధురాలు. దేవీ పురాణానుసారం శివదేవుడు ఈమె కృపవల్లనే ఈ సిద్ధులను పొందినట్లున్నది. ఈమె కరుణవల్లనే శివుని అర్ధ శరీరం దేవిది అయినది. అందువల్లనే అతడు అర్ధనారీశ్వరుడు కాగలిగాడు. సిద్ధి దాత్రీదేవి చతుర్భుజురాలు. ఈమె వాహనం సింహం. ఈమె పద్మంపై కూడ ఆసీనురాలవుతూ ఉంటుంది. ఈమె దక్షిణ అధోహస్తంలో చక్రమూ, పై చేతిలో గద, ఎడమవైపున గల క్రింది చేతిలో శంఖమూ, పై చేతిలో కమలమూ రాజిల్లుతూంటాయి. నవరాత్రోత్సవాలలో నవమ దివసాన ఈమె ఉపాసింపబడుతుంది. నాడు శాస్త్రీయ విధివిధాన పూర్ణ నిష్టలతో సాధన చేసే సాధకునకు సిద్ధులన్నీ ప్రాప్తిస్తాయి. అతనికి ఈ విశ్వంలో అగమ్యమన్నదేదీ ఉండదు. బ్రహ్మాండం మీద సంపూర్ణ విజయ సామర్ధ్యం అతనికి వస్తుంది.

ప్రతివ్యక్తీ సిద్ధిదాత్రి దేవి కరుణను పొందడానికి ప్రయత్నించాలి. ఆమె ఆరాధన వైపు పురోగమించాలి. ఆమె కరుణ వల్ల అనంత దుఃఖ రూప సంసారం నుండి నిర్లిప్తుడై సుఖాలను అన్నింటినీ అనుభవించి మోక్షాన్ని పొందగలుగుతాడు.

నవ దుర్గలలో సిద్ధిదాత్రీదేవి చివరిది. అష్ట దుర్గల పూజలు విధి విధానంగా చేస్తూ భక్తుడు దుర్గాపూజలో నవమినాడు సిద్ధిదాత్రి దేవ్యుపాసనలో ప్రవృత్తుడు కావాలి. ఈ దేవి ఆరాధన పరిపూర్ణం చేసిన తరువాత భక్తుల సాధకుల లౌకిక, పారలౌకిక కామనలన్నీ సిద్ధిస్తాయి. సిద్ధిదాత్రీదేవి కృపకు పాత్రుడైన భక్తుని కామనలేవీ శేషించి ఉండవు. అతడు సర్వాభీష్టాలకూ, ఆవశ్యకతలకూ అతీతంగా భగవతి దివ్య లోకాలలో మానసికంగా విహరిస్తూ ఆమె కృపారసామృతాన్ని పానం చేస్తూ విషయ భోగశూన్యుడై ఉంటాడు. భగవతీ మాత సాన్నిధ్యమే అతని సర్వస్వమవుతుంది. ఆ పరమపదాన్ని పొందిన సాధకునకు ఏ వస్తువు యొక్క అవసరమూ ఉండదు.

మాతృ చరణ సాన్నిధ్యాన్ని పొందడానికి మనం నిరంతరం నియమ నిష్టలతో ఉంటూ ఆమెన్ను ఉపాసించాలి. భగవతీ మాతృస్మరణ ధ్యాన ఆరాధనలలో - ఈ ప్రపంచం సారహీనమైనదని గ్రహిస్తూ వాస్తవిక పరమ శాంతి దాయక అమృతపదం వైపు మనం పురోగమించాలి.

"సిద్ధిదాత్రీ దేవికీ జై"

**- పురాణపండ రాధాకృష్ణమూర్తి**

'జీవితంలో ప్రతి సెకను అమూల్యమైనది. వ్యర్ధంగా కూర్చోవడం వలన జీవితంలోని విలువైన క్షణాలెన్నో నిరుపయోగంగా గడచిపోతాయి. తరువాత మనం ఎంత విచారించినా ప్రయోజనం లేదు. ఎంత విలువ చెల్లించినా ఆ క్షణాలను తిరిగి పొందలేము.' - శ్రీజవహర్ లాల్ నెహ్రూ

భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవ

# సమర శంఖారావాలు

సీ॥ ఆంగ్ల పాలనశక్తి నంతరింపగ చేయు
స్వాతంత్ర్య సమరంబుసల్పు నాడు
ఉద్యమస్ఫూర్తితో నుత్తుంగ తరగలై
పోరాడిరెందరో ధీరవరులు
సమరశంఖారావ చైతన్య మమరమై
ప్రబలి వందేమాతరమ్ము వెలసె
ఆగష్టు పదునైదు త్యాగఫలంబది
జెండా నమస్కార జైత్రయాత్ర

తే॥గీ॥ దుష్టదాస్య శృంఖలములన్ త్రుంచి వేసి
నీచపరదేశ పాలనా రాచరికము
పారద్రోలిన యోధుల పాటవాల
మహిత ధీశక్తి గనుడోయి మాన్యులార

సీ॥ వీరసావర్కరు విప్లవాగ్నికణాలు
బెదిరించి బ్రిటీషుల నదరగొట్టె
వీరకిశోరమై పోరాటమున్ సల్పె
శూరభగత్సింగు పౌరుషముగ
తెల్లదొరలగుండె చల్లారిపోజొచ్చె
అల్లూరి శౌర్యమహోర్భటాల
నేతాజి సేనల నైతికపటిమయే
ఆంగ్లపాలనతీరునణచివేసి

తే॥గీ॥ ఆంధ్రకేసరి ప్రతిభామహత్వ గరిమ
శాంతి సత్యాగ్రహోద్యమ సమరనేత
గాంధితాత, సహనశీల ఘనచరిత్ర
కుటిలమగు నాంగ్ల ప్రభుతనే కూల్చివేసె

సీ॥ వల్లభాయి పటేలు వాగ్ధాటి విభవరాలు
నెహ్రూజీ చాతుర్యనియతిసుగతి
పట్టాభి యోధుని బల పరాక్రమగతి
రాజాజి చూపిన ప్రాభవాలు
భాగ్యవిధాత సుబ్బారావుతాత సా
హసములందు విజేత, అమరచరిత
భద్రమౌముద్రలై భారతీయుల గుండె
లో తులన్ నిలిచె సచేతనముగ

తే॥గీ॥ ఘనచరిత్ర కల్గిన వీరగాథలెన్నొ
భరతజాతీయ సంస్కృతీ వైభవాలు
పఠనమొనరించి నడువుడో పౌరులార
ఉత్తమాదర్శమొందుడో యువకులార

సీ॥ లాఠి దెబ్బలకోర్చి కాఠిన్యమౌ శిక్ష
లొందిరానాటి మహోద్యమాల
ఆస్తిపాస్తి వదలి ఆలుపిల్లల వీడి
త్యాగులైపోరిరి యమరులైరి
అజ్ఞాత వీరుల యాశయధ్యేయమే
స్వాతంత్ర్య భారత సాధనంబు
నేటిప్రజాస్వామ్య నేతలు కొందరు
స్వాహావిలాస సమ్మోహులైరి

తే॥గీ॥ భావిభారత యువకులౌ పౌరులార
జాగరూకులై వారల జాడలరసి
నాటిధీరపురుషుల విన్నాణములను
ధ్యేయముగ పట్టి నడువుడో ధీరులార

## జైహింద్

-పంచాంగము శీనప్పశాస్త్రి

# శ్రావణ లక్ష్మి

"సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్ధ సాధికే
శరణ్యే త్రయంబకే దేవి నారాయణి నమోస్తుతే"॥

శ్రావణ మాసం వచ్చింది. పచ్చని మామిడి తోరణాలతో పసుపుకుంకుమలతోను ప్రతి ఇల్లు కళకళ లాడిపోతుంటుంది. క్రొత్తగా పెండ్లయిన ఆడపిల్లలు తాము జీవితాంతం దీర్ఘసుమంగళిగా ఉండాలని కోరుకుంటూ అమ్మలగన్న యమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ అయిన ఆ ఆదిపరాశక్తిని మంగళ గౌరి రూపంలో పూజించుతారు. ఇది ఐదు సంవత్సరాలు చేసుకోవలసిన నోము. రెండవది వరలక్ష్మి వ్రతం.

"పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే
నారాయణప్రియేదేవి సుప్రీతాభవ సర్వదా"॥

అంటూ అష్టైశ్వర్యాలకు మూలమయిన ఆ మహాలక్ష్మిని శ్రీ వరలక్ష్మి రూపంలో పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారం నాడు పూజిస్తారు. ఈ వ్రతాన్ని స్త్రీలు జీవితాంతం నోచు కుంటారు. తరువాతది జంధ్యాల పూర్ణిమ. ఉపనయనము అయిన వారికి ఈ జందెము చాలా పవిత్రమయినది. ఉపనయనము నాడు వటువుకు పవిత్రమయిన గాయత్రీ మంత్రమును ఉపదేశిస్తారు.

"న గాయత్ర్యా పరం మంత్రం
న మాతు పరదైవతం"

అనగా గాయత్రీ మంత్రము కంటే గొప్ప మంత్రము, తల్లి కన్న ఎక్కువైన దైవము ఈ సృష్టిలోనే లేదు. అని అర్ధము. గాయత్రీ మంత్రము ఇరవై నాలుగు అక్షరములతో కూడినది. ఒక్కొక్క అక్షరమునకు ఒక్కొక్క దేవత ఉన్నది. దీనిని "చతుర్వింశతి గాయత్రి" అని కూడా అంటారు. ఈ గాయత్రీ మంత్రమును అత్యంత భక్తి శ్రద్ధలతోను, నియమనిష్ఠలతోను, జపించేవారికి ఆ దేవతలందరూ సంపూర్ణమయిన ఆశీశ్శులనూ, సకల శుభాలనూ కలుగ జేస్తారు. అంతేగాక కీర్తిని, తేజస్సును కూడా ప్రసాదిస్తారు. అటువంటి గాయత్రీ మంత్రమును ప్రతివారూ జపించి తరించాలి. శ్రావణ పూర్ణిమ నాడు క్రొత్త జందెమును వేసుకొని గాయత్రీ మంత్రాన్ని జపిస్తారు. ఇది వటువులకు, గృహస్థులకు కూడా చాలా పవిత్రమైన రోజు.

" వసుదేవసుతం దేవం కంస చాణూరమర్దనం
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్

శ్రావణ బహుళ అష్టమి రోహిణీ నక్షత్రం అర్ధరాత్రి శ్రీకృష్ణుని పుట్టిన రోజు. చిన్ననాడు చిలిపి కృష్ణుడుగా నవ్వుతూ నవ్వుతూనే దుష్టశిక్షణ శిష్టరక్షణ చేస్తూ అనేక అద్భుతాలను చూపించాడు ఆ నల్లనయ్య. ఆ తరువాత మురళీకృష్ణుడుగా మోహన మూర్తిగా అందరి హృదయాలను దోచుకున్నాడు. మహాభారత యుద్ధంలో అర్జునునికి గీతోపదేశం చేసి తనయొక్క 'విశ్వరూపాన్ని' చూపించాడు. గీతాబోధ అర్జునునికి ఒక్కనికే కాదు. ప్రపంచానికే అది "శ్రీ భగవద్గీత". అందుకే ఆయన "జగద్గురువు" అయినాడు. తెలుసుకోవాలనే కోరిక ఉండాలి గాని, 'గీత'లో లేని ధర్మం లేదు. ఆ గీతామృతాన్ని ఎవరి ఓపికను బట్టి వారు ఆరగించి జీర్ణించుకొని ఆచరించి తరించాలి. ఇన్ని పండుగలను పర్వదినాలను తనతో తెస్తుంది శ్రావణ లక్ష్మి. అదీగాక ఇప్పటి వరకు గ్రీష్మతాపంతో ఉన్న పుడమి తల్లి శ్రావణ మాసంలో కురిసే వర్షాలకు చల్లబడుతుంది. ప్రకృతి అంతా పచ్చగా కళకళలాడుతూ ఉంటుంది. గ్రీష్మ ఋతువు పోయి వర్ష ఋతువు ప్రవేశిస్తుంది. ఏ ఇంట్లో చూసినా నోములూ వ్రతాలూ పేరంటాళ్ళ సందడే. ఎంతో సంతోషాన్నీ సందడినీ తనతో తెస్తుంది శ్రావణలక్ష్మి.

"వక్రతుండ మహాకాయ కోటి సూర్య సమప్రభ
నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా"

సర్వ విఘ్నములను నివారించి సర్వ కార్యములయందు విజయమును చేకూర్చే ప్రధమ పూజ్యుడు శ్రీ మహా గణాధిపతి. ఎంత చిన్న పనిచేయాలనుకున్నా మొట్టమొదట విఘ్నేశ్వరునే పూజిస్తారు. ముఖ్యంగా విద్యార్థులకు విద్యను, బుద్ధిని ప్రసాదిస్తాడు. భాద్రపద శుద్ధ చవితినాడు గణపతిని గరికతోను, రకరకాల పత్రితోను పూజించి, ఆవిరి మీద ఉడికిన ఉండ్రాళ్ళు నివేదన చేస్తారు. జాతి మత బేధములు లేక సర్వులూ పూజించే దేవుడు, సర్వ సిద్ధి ప్రదాయకుడు, వినాయకుడు. ఈ సంవత్సరం ఆగష్టులోనే వినాయకచవితి కూడా వచ్చింది. కాబట్టి ఈ నెలంతా సందడే సందడి. కాబట్టి సర్వదేవతలనూ పూజించి సకల శుభాలూ పొందుదాం.

- కొమరగిరి జయప్రద